

# విశ్వహిందు

ధార్మిక - సామాజిక మాసపత్రిక

సెప్టెంబర్ - 1996.

విశ్వహిందూ పరిషత్ - ఆంధ్రప్రదేశ్



(16.9.96 వినాయక చవితి) విఘ్ననాయకుని మనం కొలుస్తాం. వినాయకుడు తన మాతా, పితరులను కొలుస్తున్నాడు

## దుర్గావాహినీ సమ్మేళనం

26.7.96న కిసాన్‌నగర్ (ఇందూరు - జిల్లా)లో 15సం॥ నుండి - 35సం॥ లోపు యువతులతో సమ్మేళనం జరిగింది. 65 మంది పాల్గొన్నారు.

నేటి యువతులకు మన సంస్కృతి, సంప్రదాయం పట్ల సదవగాహన కల్గించి, ఈనాటి మహిళలు ఎదుర్కొనుచున్న సమస్యల ను ధైర్యంతో, శక్తితో ఎదుర్కొనే స్థైర్యాన్ని అందిచడం సమావేశ ఉద్దేశ్యం.

ఇందులో ఇందూరు విభాగ్ మహిళా ప్రముఖ్ శ్రీమతి స్వర్ణలత, జిల్లా మహిళాప్రముఖ్ శ్రీమతి వైట్ల శ్రీలక్ష్మిగారలు పాల్గొని సమావేశాలు నిర్వహించారు.

గీతా జనాశ్రమంలో జరిగిన ఈ కార్యక్రమానికి ఆశ్రమ స్వామీజీ పూజ్య శ్రీ జ్ఞానానంద వారు ఆశీస్సులందించినారని ఇందూరు జిల్లా దుర్గావాహిని ప్రముఖ్ శ్రీమతి మంగళ తెలియ జేశారు.



# 'విశ్వహిందు'

(ధార్మిక, సామాజిక మాసపత్రిక)


| సంపుటి : 10 | సంచిక : 9 | ధాత - శ్రావణం | సెప్టెంబర్-1996 |
|---|---|---|---|




చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. **500.00**

వార్షిక చందా – రూ. **50.00**

విడిప్రతి – రూ. **5.00**

డి.డి.లు '**విశ్వహిందు**'.

అని మాత్రమే పంపవలెను.


చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, ''విజయశ్రీ''

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్: 517799, 591322.


ఈ సంచికలో ........ పుట



ముఖ చిత్రం : పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ

## సంపాదకీయం హిందుత్వం - ధర్మకర్తృత్వం

భారతీయ అర్థశాస్త్రానికి మూలం ధర్మకర్తృత్వ సిద్ధాంతం. ఇది కౌటిల్యుని శాస్త్రంలో, భారతాది గ్రంథాల్లో అవసరం మేరకు కనిపిస్తుంది. వ్యక్తిలో ఆశను పెంచకుండా, తన విధి-కర్తృత్వానికి కట్టుబడి వ్యవహరించే విధంగా తీర్చిదిద్దే అపూర్వ శక్తి ఈ సిద్ధాంతానికుంది.

ఆధునిక రాజకీయాల్లో ''గాంధేయవాదం'' అనే మాట వింటుంటాం. గాంధీగారు ఈ ధర్మకర్తృత్వాన్ని నవీన దృష్టితో చెప్పడానికి చేసిన ప్రయత్నం కారణంగా, గాంధీ గారి పేరుకున్న వ్యాప్తినీ, ప్రఖ్యాతిని దృష్టిలో పెట్టుకొని కొందరు రాజకీయాల నిచ్చెన మెట్లు ఎక్కడానికి చేసిన విఫలయత్నం కారణంగా ఈ పేరు కొంత ముందుకు వచ్చి ఆగిపోయింది. అయితే ధర్మకర్తృత్వాన్ని ఆధునీకరించి వ్యాప్తి చేయడంలో బహుళకృషి చేసిన మనీషి పండిత దీనదయాల్ ఉపాధ్యాయనే ప్రప్రథమంగా చెప్పుకోవాలి.

మనం ఒక పని చేస్తున్నాం. ఆ పని చేయడం మన విధి. ఆ విధి నిర్వహణలో మన చేతికి కొంత భూమి వస్తుంది; ఒక కార్యాలయం వస్తుంది; కొన్ని గ్రంథాలు వస్తాయి; ఒక అల్మారీ వస్తుంది; ఓ తుపాకీ వస్తుంది. విధి నిర్వహణ వరకు వీటిని జాగ్రత్తగా వాడాలి. విధి నుండి దిగిపోయేటప్పుడు, ఆ విధి బాధ్యతను స్వీకరించే వారికి మళ్లీ ఇవన్నీ అప్పగించాలి. వాటిని పాడు చేయరాదు; ఏ మాత్రం చెడిపోయినా బాగుచేయించి నీ తర్వాతి వారికివ్వాలి.

ఇల్లు, భూమి, ఆఫీసు, తుపాకి – యేదైనా కానీ అది నీ కొడుక్కో, నీ వారసుడికో, నీ తర్వాత నీ ఆ విధి నిర్వహించే వాడికో అప్పగించాలి. కాని వెంటగట్టుకపోతానని అనుకోరాదు. ఇది నా సొంతం; ఏమైనా చేసేస్తా అని పాడుచేయరాదు. ఉన్నది గట్టిపరిచి భద్రంగా ఇవ్వాలి గాని, నా తర్వాతి వాడు నానా కష్టాలు పడాలని పాడుచేసి ఇవ్వరాదు.

శతాబ్దాలుగా, సహస్రాబ్దాలుగా ఇదే మానసం రాజ్యాన్ని పరిపాలించిన రాజుకున్నది. వ్యవసాయక్షేత్రాన్ని సశ్యశ్యామలం చేసిన కర్షకునికున్నది. వాణిజ్య రంగంలో ఉన్న వ్యాపారికున్నది. దేశ రక్షణలో ఉన్న జవానుకున్నది. అందువల్లనే ఇంతకాలం ఉన్నవేవో ఇవన్నీ భద్రంగా ఉన్నవి.

విజయనగర రాజ్య పతన దశలో సకలం చిన్న తిమ్మరాయలు, పెద తిమ్మరాయలు దురాక్రమణ చేసి పరిపాలిస్తున్న రాజ్యం తమ చేతుల్లోంచి పోతుందని తెలిసిన వెంటనే, తమ తర్వాత అధికారం అనుభవించేవాడికి పంచ కల్యాణి గుఱ్ఱాలు, వజ్రవైఢూర్యాలు, ఐరావతాలు దక్కరాదని ''పంచకంతలు'' చేశారు; పాడు చేశారు; పిచ్చిగా వ్యవహరించారు; చివరకు ఏదీ దక్కకుండా పోయారు.

ఆ తర్వాత ఆ 'విధి' నిర్వహణకు వచ్చినవారు ఇవన్నీ సమకూర్చుకోడానికి కొంత

కష్టపడ్డారు. కాని సహకూర్చుకొన్నారు. తాము మాత్రం పాడు చేయకుండా తమ తర్వాతి వారికందించారు.

ధర్మకర్తృత్వ సిద్ధాంతం ఈ ''తిమ్మ ద్వయం'' అనుసరించక పోవడం వారి తప్పే. ఆ తప్పు అందరూ చేస్తే సృష్టి ఉండదు; సృష్టిలో సంతులనం ఉండదు.

అందుకే ఈ సృష్టిలో ఆయా విధి విధానంలో నిబద్ధులైనవారు ధర్మకర్త (ట్రస్టీలు)లే తప్ప, ధర్మహర్తలు కారు. అలా ధర్మహర్తలు అయిన వారు సృష్టిలో ఉండడానికే అనర్హులు. ఒక అఖండ భావనతో అవిచ్ఛిన్నంగా సాగి వస్తున్న, ధర్మకర్తృత్వాన్ని – తన ధర్మంగా స్వీకరించి మనిషి ఆదర్శంగా తన తరువాతి వారికి కనిపించాలి.

కాని ఒక అలెగ్జాండర్, ఒక హిట్లర్, ఒక ముస్సోలిని, ఒక ఔరంగజేబు, ఒక చంగీజ్‌ఖాన్, ఒక నిజాం ఈ సిద్ధాంతాన్ని పాటించ లేదు. తానుండాలి; తన జాతి ఉండాలి; తన మతముండాలి; తన దేశముండాలి. మిగతాదంతా ఏమైపోయినా సరే అనుకొనే మనస్తత్వం ధర్మకర్తృత్వ సిద్ధాంతానికి వ్యతిరేకమయినది.

అందుకే ''ధర్మ రాజ్యం'' హిందుత్వం అందించిన అపూర్వయోగదానం (కంట్రిబ్యూషన్) అంటారు దీనదయాళ్జీ.

''నిరంకుశత్వాన్ని అరికట్టి ప్రజాస్వామ్యంలో వికృతులు చొరబడకుండా చూడటంలో 'ధర్మ రాజ్యం' సమర్ధవంతంగా ఉంటుంది. రాజ్యం అంటే ఉన్న ఇతర ఆలోచనలు అధికారాన్ని ఆధారంగా చేసుకొని ఉన్నవి. కానీ ధర్మ రాజ్యం కర్తవ్య భావాన్ని ప్రధానంగా తీసుకొన్నది. కాబట్టి తన అధికారాన్ని కోల్పోతాననిగాని, అధికారాలు ఎక్కువ చేసుకోవాలనే ఆరాటంకాని, పరిమిత అధికారాల అసంతుష్టికాని, అధికారం చేజిక్కించుకొన్న తర్వాత కర్తవ్య విస్మరణగాని, వివిధ అధికారాల మధ్య సంఘర్షణకాని ఉండే అవకాశం లేదు''.

ప్రపంచంలోని అన్ని సిద్ధాంతాలకంటే పరమోత్తమమైంది ధర్మకర్తృత్వ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని అనుసరిస్తే వ్యష్టి, సమష్టి, సృష్టి అస్తిత్వాలకు ఎంతమాత్రం ప్రమాదం రాదు. మహా ధర్మచక్ర పరిభ్రమణంలో ప్రతిజీవీ తన కర్తవ్యంలో తిరిగే, తిరిగించే మహత్తర శక్తి ఈ''ధర్మం''కు ఉన్నది. ధర్మాన్ని నిర్వహించే కర్తృత్వశీలిగా వ్యక్తి మారాలి. అంతే! అప్పుడే ధర్మకర్తృత్వ సిద్ధాంతం ప్రపంచాన్ని అజరామరంగా ఉంచగలుతుంది. ఇలా విశ్లేషించుకొన్న ఈ అంశం పండిత దీనదయాళ్ దృక్పధానికి రేఖామాత్ర స్పర్శగానే భావించండి! ఈ స్పర్శతో ఆలోచించండి!.

**హిందుతత్వ సరళి విశ్వవిఖ్యాతిగా**
**ధర్మకర్త బాధ్యత తలదాల్చి**
**దేశ, ధర్మగతిని దేదీప్యమొనరింప**
**విశ్వహిందు వాణి వినుడు వినుడు**

*- సుందరం.*

(శ్రీకృష్ణాష్టమి)

# యుగపురుషుడు

శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడా? లేదా వ్యాస మహర్షి ఊహాకల్పితమా అన్న సందేహం కలుగుతుంది. మహాభారతం కల్పిత కావ్యం కాదు. అది ఒక చారిత్రక గ్రంథం. అందుకే దాన్ని ఇతిహాసం అన్నారు. మనకు శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడనటానికి మహాభారతాన్నే ఆధారంగా తీసుకోవచ్చు. ఆ మహానుభావుడు తనువు త్యజించేప్పుడు ఆ రోజే కలియుగం ప్రారంభమైంది. ''యస్మిన్ కృష్ణోదివం యాత: తస్మిన్నేవ తదాహని ప్రతిపన్నం కలియుగం'' – అన్నారు. ఇది చాలా ముఖ్యమైనది. ఇక భాగవతంలో కృష్ణుని జన్మదినాన్ని గూర్చి అ రోజు ''ప్రజాపతి'' నక్షత్రం ఉన్నదన్నారు. ప్రజాపతి నక్షత్రం అంటే రోహిణి. విష్ణుపురాణం శ్రీకృష్ణుడు శ్రావణ బహుళ అష్టమి నాడు జన్మించాడని తెలుపుతుంది. శ్రీకృష్ణ నిర్యాణం జరిగిన సంవత్సరమే పరిక్షిత్తు పట్టాభిషేకం జరిగింది. ఇలాంటి అనేక ఆధారాలను బట్టిచూస్తే క్రీస్తుపూర్వం 3228 జూలై 19 నాడు కృష్ణుడు జన్మించినట్టుగా తెలుస్తుంది. దాన్ని తెలుగులో చెప్పాలంటే శ్రీముఖనామసంవత్సర శ్రావణ బహుళ అష్టమి రోహిణీ నక్షత్రం చతుర్థ చరణం నాడని తేలుతుంది. క్రీస్తుపూర్వం 3102 ఫిబ్రవరి 20వ తేదీనాడు పరమపదించాడని నిర్ధారించారు. వీటినిబట్టి చూస్తే సరిగ్గా 5000 సంవత్సరాల నాడు శ్రీకృష్ణుడు ఉన్నాడు అని తేలుతుంది.

మనవారు శ్రీకృష్ణుని లౌకిక గుణములను విస్మరించి ఆతని చుట్టూ అలౌకిక గుణాల్ని పెంచారు. అందువల్ల కృష్ణుడు ఇతరుల దృష్టిలో జారుడు, చోరుడు, మోసకారి, వంచకుడు అనే భావాలు వచ్చాయి. కాని ఇది నిజం కాదు. మహాభారత కృష్ణుడు ఒక ఆదర్శమూర్తి. కృష్ణుడు స్వయంగా చెప్పిన మాట. ''అహం హితత్ కరిష్యామి పరం పురుషకారిత:, దైవంతునమయాశక్యం కర్మకర్తుం కథంచన'' అని మహాభారతంలో అన్నాడు. దైవ నిర్ణయాలు నా వశంలో లేవు. నేను మానవ ప్రయత్నమే చేస్తాను అంటాడు. మహాభారతంలో కృష్ణగోపికల ప్రసంగములు కనిపించవు. శ్రీకృష్ణునికి ఒకే భార్య ఆమెయే రుక్మిణి. మిగతా భార్యల కథలన్నియు అలౌకికములని బంకించంద్రుడు తన పరిశోధన గ్రంథములో వ్రాసెను. శ్రీలాలాలజపతరాయ్ శ్రీకృష్ణ చరిత్ర అను గ్రంథము వ్రాసి అందులో ''ప్రపంచంలో మహాపురుషులపై విరోధులు అనేక అపరాధముల కథలల్లుతారు అది సహజమే. కాని మహాపురుషుడైన శ్రీకృష్ణునిపై ఆయన భక్తులే అనేక దోషారోపణలు చేసిరి'' అన్నారు. బాగా పరిశీలిస్తే ఇది అసత్యం కాదనిపిస్తుంది.

శ్రీకృష్ణుని జీవితం మనకెంతో ఆదర్శప్రాయం. ఆయన తెల్లవారు ఝామునలేచి సంధ్యావందనం చేసుకొనేవాడట. ''బ్రాహ్మే ముహూర్తే ఉత్థాయోపస్పృశ్య మాధవ:'' అన్నారు. ఆ తరువాత అగ్నిహోత్ర విధి నిర్వహించి, వేదాధ్యయనము సాగించి, గాయత్రి జపము చేసేవాడు. భగవాన్ వేదవ్యాసుడు మహాభారతంలో శ్రీకృష్ణుని దివ్యపురుషునిగా కాక యుగపురుషునిగా రూపొందించెను. ఇతడు రాజనీతి కోవిదుడు, శీలవంతుడు, వేదవేదాంగవిదుడు, నీతిమంతుడు, శూరశిరోమణి, అధర్మ కార్యములుగాని, చెడు కార్యములుగాని చేసి యెరుగడు. ఇతడు వృష్ణి వంశమువాడు. భారతదేశ చరిత్రలో శ్రీకృష్ణుడు ఒక ఉజ్జ్వలతార. మానవుడిగా ఉంటూ అనేక సుగుణములను ఆచరించిన ఆదర్శజీవి. ఆతడొక ఆదర్శ మిత్రుడు, శాంతిప్రియుడు.

మహాతేజోసంపన్నుడు. నిరంతర కర్మయోగి, యుద్ధనీతియందు విశారదుడు, వైదికాదర్శముల ప్రతీక, ఒక హైందవుని సంపూర్ణ రూపమును శ్రీకృష్ణునిలో దర్శింపవచ్చును.

ఈనాడు మన హిందూ సమాజము జాగృతినందవలె నన్నచో శ్రీకృష్ణుని ఆదర్శమును పాటించవలయును. ఆతనిలోని సేవాతత్పరత, నిస్స్వార్థత, విజిగీష, కర్మయందభిలాష యే నేటి మానవులు ఆచరించదగినవి. అందుకే జన్మాష్టమి రోజు శ్రీకృష్ణునికి తొట్టెకట్టి రాత్రి దాకా నిరాహారం చేసి దివ్యంగా భోజనం చేయుటమొక్కటే సరిపోదు. శ్రీకృష్ణుని గురించి ఆతని జీవన విధానం గురించి మనమంతా వివరంగా తెలుసుకొని హిందూ సమాజాన్ని సుష్టుగా, పుష్టిగా తయారు చేయాలి. అతడు దక్షిణనాయకుడని, వెన్న దొంగ అని, గొల్లభామల చుట్టు తిరిగే వాడని తెలుసుకొంటేే మన ఆదర్శం మన సమాజ అస్తిత్వం రమణీయంగా ఉండదు. మహాభారతంలోని కృష్ణుని ఆదర్శమే నేటి ప్రతి హిందువు ఆదర్శంగా మారాలని కోరుకోవాలి. అన్ని ధర్మాలు వదలి నన్నాశ్రయించు అన్నాడని పలువురు గీతావ్యాఖ్యాతలు వ్రాస్తూ చెబుతూ ఉంటారు. ధర్మ పరిపాలకుడైన శ్రీకృష్ణుడు ఈ మాట అంటాడా అని ఆలోచించాను. నాకెందుకో అచ్చుతప్పుగా అనిపించింది. అది నిజమో కాదో పెద్దలాలోచించాలి. సర్వధర్మాన్ పరిత్యజ్యఅన్నచోట సర్వఅధర్మాన్ పరిత్యజ్య ఉండాలేమో. ఏది ఏమైనా, శ్రీకృష్ణుడు భారత జాతికే కాదు, విశ్వమానవులకు ఆదర్శప్రాయుడు. ఆయననుకన్న భారతదేశం ధన్యము.

**- శ్రీ చాడూరి.**

---

# శ్రీ గణేశాయ నమః

**డా. యమ్.వి.ఆర్. శర్మ**
*కార్యాధ్యక్షులు, వి.యచ్.పి. (పశ్చిమ)*

గణపతిని ప్రపంచంలోని వివిధ దేశాలలో ఎన్నో జాతులవారు అనేక నామాలతో కొలుస్తారు. 'రోమ్' లో గణేశుని 'జేన స్' గా వ్యవహరిస్తారు. ఈ జేనస్ అనే పదం కూడా గణేశ్ శబ్దానికి సమీపంగా వుండడం గమనార్హం. గణపతికి గొప్ప 'వ్రాయసకాడు'గా కూడా, అందునా వేగంగా వ్రాసే లేఖకుడుగా గుర్తింపు వున్నది. వ్యాసుడు పురాణాలను చెపుతూవున్న కొద్దీ గంటాన్ని ఆపకుండా వ్రాయగలిగింది వినాయకుడు మాత్రమే.

ఆస్తిక్యత సర్వ హిందువులకూ మూలకందమైనది. ఆహార, నిద్రాదుల వలెనే దైవపూజ కూడా మన దైనందిన విషయాలలో సర్వసాధారణమైనది. ఆ పూజ వినాయకునితో ప్రారంభించుట మన సంప్రదాయము.

పూజలేకాదు, ఏ జీవన సంవిధానమైనా సరే గణపతిని ప్రార్థించి ఆ తరువాతనే కొనసాగించటం పరిపాటి.

విఘ్నేశుని పూజ లేకుండా ఆ మొదలు పెట్టిన కార్యమేదీ సంపూర్తి కాదనీ, ఆరంభించిన పనికి అడ్డంకులు – విఘ్నాలు – బహుధా వస్తాయనీ విశ్వాసం.

హిందువుల ధార్మిక సంపద అయిన వేదరాశిలోని మంత్రాలు ప్రణవమని పిలువబడే ఓంకారంతో మొదలవుతాయి. మహాకవి కాళిదాసు రఘువంశంలో యీ విషయాన్ని ఆలంకారికంగా

వర్ణించాడు. ఈ ఓం కారం, ఏ భాషలో చూచినా, వినాయకుని పోలి వుంటుంది. గణపతి వాహనమైన ఎలుక తామసానికి ప్రతీక. ఆ తామసాన్ని అధివసించిన గణపతి మనకు ఆదర్శప్రాయుడు.

ప్రార్థించే వ్యక్తి యొక్క మానసిక స్థితి, సంస్కారము, పూర్వజన్మ కర్మ పరిపాకము మొదలైన వాటిపై ఆధారపడి ఆ వ్యక్తికి దైవం వివిధ రూపాలలో ఆరాధ్యుడౌతాడు. దైవ రూపం ఏ దైనా దైవత్వం దైవత్వమే. వివిధ దేవతలకు చేసే పూజలూ ఆ పరమాత్మకే అందుతాయి. శివ మహిమ్న స్తోత్రంలో చెప్పినట్లు రక, రకాలైన పంథాలను తొక్కే జలాల కన్నిటికీ గమ్యము సముద్రమే కదా! (రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానా పథ జుషాం నృణామేకో గమ్యః త్వమసి పయసా మర్ణవ ఇవ)

ఈ గణపతికి ఇద్దరు 'భార్యలు' ఒకరి పేరు సిద్ధి. మరొకరి పేరు బుద్ధి. హిందువుల ఆరాధనా పద్ధతులలో అత్యంత గంభీరమైన విషయాలు కూడా ఎంతో సరళంగానూ సహజ, సుందరం గానూ చిత్రీకరించబడుట వొక ఆశ్చర్యకర విషయము!

లంబోదరుడని గణనాయకునికి యింకొక పేరు. పెద్ద బొజ్జగల వాడని దీని అర్థం. సమాజం సుఖ, శాంతులతో తులతూగుచున్నప్పుడు ఆహారం, విద్య మొదలు గాగల వాడికి లోటెక్కడ? ఆహార సమృద్ధి లేనప్పుడు బొజ్జకు ఆస్కారమే లేదు గదా! అయినా, సాధారణంగా సౌందర్యానికి అడ్డంకిగా తోచే 'బొజ్జ' లంబోదరుని విషయంలో మాత్రం ఆదరణకే నోచుకున్నది. పిల్లలకు యిష్టమైన వాడుని కూడా ఈ దేవుడు సుప్రతిష్ఠితుడు.

వినాయకుని పూజ చేకు మొదలైన అరణ్యాలలో దొఱకే వనస్పతులకు ప్రాధాన్యం యిచ్చి, అడవుల ప్రాశస్త్యాన్నిమన వాళ్లు నొక్కి వక్కాణించినారు.

వినాయకుణ్ణి చేయగలవా అంటే, అతని బాబుని కూడా చేయగలనని లింగాన్ని చేసి యిచ్చాడని వొక సామెత – జనజీవనంలో హాస్యదృష్టినీ, చమత్కార సృష్టినీ ద్యోతకం చేస్తున్నది.

హిందూ దేశంలోని మతాలన్నిటినీ సమన్వయం చేసిన ఆది శంకరులు పంచాయతనంలో గణనాథుణ్ణి వొకడిగా – సంప్రతిష్ఠించి నారు. (ఆదిత్య, మంబికాం, విష్ణుం, గణనాథం, మహేశ్వరం)

తిలక్ మహాశయుడు గణేశ పూజకు సామూహిక, సార్వజనీన పద్ధతిని అనుసంధించి హిందూ సంఘటనకు ఎనలేని సేవ చేశాడనుట మన అనుభవం లోనిదే. ఈ మలుపు ఎన్నో శుభ పరిణామాలకే దారితీస్తుందని ఆశిద్దాము.

---

# భారతీయులెవరు?

*(సెప్టెంబర్ 5 – రాధాకృష్ణ జన్మదినం – ఉపాధ్యాయ దినం)*

డా. రాధాకృష్ణ స్వతంత్ర భారతదేశానికి రెండవ రాష్ట్రపతి. ఆయన ప్రపంచ ప్రసిద్ధ తత్త్వవేత్త. తాత్త్విక విషయాలను సరళ సుందరమైన రీతిలో ఆయన వివరిస్తుంటే శ్రోతలు ఆశ్చర్య చకితులైపోయేవారు.

స్వాతంత్ర్యానికి ముందు ఒకపర్యాయం డా. రాధాకృష్ణన్ ఒక విందుకు హాజరైనారు. ఆ విందుకు ఒక ఆంగ్లేయుడు కూడా వచ్చాడు. ఆ సమయంలో ఆంగ్లేయుడు ఇలా చెప్పాడు.

'ఆంగ్లేయులమైన మేము భగవంతునికి అత్యంత ప్రీతిపాత్రులం. భగవంతుడు మమ్మల్ని ఎంతో

తరువాయి భాగం – 18 పేజీ

# దండోసి! దండోసి! ధర్మ దండోసి!

ధర్మనిష్ఠమైన భారతదేశ నేతలు భ్రష్టాచార నిందితులు కావడం అత్యంత బాధాకరం. భ్రష్టనేతల రాజ్యాల సమాఖ్యలో భారతదేశం కూడా చేరిపోయింది. అంటూ ఒక పత్రిక శీర్షిక నిచ్చింది. ఇది భారతజాతీయ స్వాభిమానానికి, ప్రతిష్ఠకు నిజంగా దెబ్బ.

లక్షడాలర్ల దగా కేసులో శ్రీ పి.వి. నరసింహారావుకు హైకోర్టు సమన్లు ఆదేశించడంపై ఈ మాదిరి శీర్షికలొచ్చాయి. శ్రీ రావు భ్రష్టాచారంలో భాగస్వామ్యం కాదా? ఈ ఆరోపణలో నిజమున్నదా లేదా? ఆరోపణ పర్యవసానమేమిటి? ఇత్యాదులు ఇక్కడ ప్రస్తుతాంశం కాదు. అవన్నీ కోర్టులు, శ్రీరావు చూచుకునేవి. మనకు అత్యంత బాధాకరమైన విషయం ధర్మ నిష్ఠమైన దేశం అని ప్రతిష్ఠ ఉన్న మనకు ఇలాంటి స్థితి రావడమనేదే.

సమన్లకు ఆజ్ఞలిస్తూ మేజస్ట్రేట్ శ్రీ ప్రేమకుమార్ ''మీరెంత గొప్పవారైనా మీకు పైన చట్టం ఉంది'' అనే ఆంగ్ల సూక్తిని (Be you ever so high the law is above you) ఉదహరించారు పాశ్చాత్య సంస్కృతిలో న్యాయపాలనకు ఉన్నత వ్యాఖ్య ఇది. అచటి రాజ్యనీతిలో చట్టం అనేదే అత్యున్నతం. వారికి ధర్మశబ్దం తెలియదు. మన లిఖిత సెక్యూలర్ రాజ్యాంగంలో కూడా చట్టమే అత్యున్నతం. ఇందులో కూడా ''ధర్మ'' శబ్దం లేదు.

మన సాంస్కృతిక వారసత్వంలో ధర్మం సర్వోచ్చం. రాజులకు పట్టాభిషేకం చేసేటప్పుడు వారే సర్వోన్నతులనీ, తమను దండించే వారెవరూ లేరనే అహంకారానికి తావీయకుండా ధర్మగురువు– ''దండోసి, దండోసి, ధర్మదండోసి'' అని ముమ్మారు అంటూ ధర్మదండాన్ని రాజుశిరంపై ఉంచుతారు. సెక్యూలరిష్టులు ''ధర్మాన్ని'' వదలినా ''ధర్మం'' మాత్రం వారిని వదలదు. అది సెక్యూలరిష్టులనే కాదు జగదాచార్య బిరుదాంకిత చంద్రస్వామిని, వదలదు. న్యాయమూర్తి అయినా మరొకరైన వదలదు. దైవము, చట్టము, సత్యము, న్యాయము మున్నగు ఉన్నత విశేషాలన్నిటిని అంతర్భాత మొనరించుకున్నట్టిది ధర్మం. అది లిఖితమైనా, అలిఖితమైనా దాని ప్రభావం సర్వోన్నతం. అనివార్యం. ''దండోసి దండోసి ధర్మదండోసి'' అనేది అందరం గుర్తుంచుకోదగి ఉంది. అందరం ధర్మనిష్టులమవుదాం. అందులోనే అందరికీ శ్రేయస్సుంది.

సమన్లకు ఆదేశాలిస్తూ శ్రీ ప్రేమకుమార్ మహాభారతంలోని ఆదిపర్వంనుండి ఉదహరిస్తూమరొక ముక్క అన్నారు. ''సృష్టికి మూలం కాలం. లయం చేసేదీ కాలమే. పునః సృష్టికి మూలం కూడా కాలమే. సర్వమూ నిద్రాణమై ఉన్నస్థితిలో సైతం సర్వాన్ని గమనించేది కాలమే'' (Time is the root of created beings. Time doth create existence. Time destroys Time shatters all and all again renews. Time watches while all sleep on vanquished time). మనం ఈ విజ్ఞతను నిలుపుకుంటే భ్రష్టాచారాలకు తల యొగ్గం. ఎల్లరమూ గుర్తుంచుకొనదగిన మరొక సత్యమిది.



శ్రీ నరసింహరావుకు సమన్లు ఆదేశింపబడిన రోజునే తస్లీ ముద్దీన్ అనే మంత్రి రాజీనామా చేశాడు. ఆయన హోంశాఖలో స్టేటు మంత్రి. ఆయనపై అనేక ఆరోపణలున్నందువల్ల ప్రధాని శ్రీ దేవ గౌడ రాజీనామా చేయవలసిందిగా సూచించిన మీదట ఈ రాజీనామా జరిగిందట. ఆయనపై ఉన్న ఆరోపణలు

గమనిస్తే అట్టి వ్యక్తిని అత్యంత కీలకమైన హోంశాఖలో ప్రధాని అసలు ఎలా నియమించారనే ప్రశ్న వస్తుంది, దేవెగౌడకు ఆయనను గురించి ఏమితెలియదట. బీహార్ ముఖ్యమంత్రి లల్లూ ప్రసాద్ యాదవ్ ప్రాబల్యం వల్ల ఈయనను మంత్రి చేయవలసి వచ్చిందట. లల్లూకు ఆయన ఆశ్రితుడట సోషలిష్టు పార్టీలో కొంత కాలం ఉన్నాడట పైగా ముస్లిం గనుక ఈ నియామకం జరిగిందని వార్తా హరులు తెలిపారు. కీలక స్థానాల్లో నియామకాలు జరిగే తీరు ఇదేనా? ఇందులో దేశానికి భద్రతగాని ప్రతిష్ఠగాని ఉందా? న్యాయధర్మాలకు క్షేమం ఉంటుందా?

తీరా మంత్రి కాగానే తస్లీ ముద్దీన్ చేసిన ఘనకార్యమేమిటి? అయోధ్య విషయంలో వారం రోజుల్లో పరిష్కారం చేసి పారేస్తానంటూ ప్రకటనలు. మందిరమూ లేదు మసీదూ లేదు ఏకంగా గోడకట్టి ఒకపెద్దస్మారకం చేసి పారవేస్తానని, ఆభూమి మొత్తాన్ని వశం చేసుకుంటాననీ అవాకులు చెవాకులు మొదలెడితే ఇరకాటపడ్డ ప్రధాని మందలించవలసి వచ్చింది. ఇతర యునైటెడ్ ఫ్రంట్ పార్టీలు కూడా ఇరుకునపడ్డాయి. ఆయనమాటలు ''బాధ్యతా రహితం'' (Irresponsible) అన్నారు. చట్టరీత్యా ఆయనకు అయోధ్యపరిస్థితీ తెలియదు మందిరమూ లేదు మసీదు లేదు పొమ్మనే వాదం న్యాయమూకాదు. చట్టమూ కాదు. ధర్మమూ కాదు. అది హిందువులను, ముస్లింలను అందరినీ తిరస్కరించడమే.

ఆయనను పెద్ద సీరియస్‌గా తీసుకునేది లేదన్నారు ఆర్. ఎస్. ఎస్ ప్రతినిధి. కాని దేవెగౌడకు మాత్రం తలనొప్పి అయినాడు. ఆయన రాజీనామాతో కాస్త తెరపిన పడ్డట్లయింది దేవగౌడకు.



కాని హోంశాఖలోనే మరొక నియామకం జరిగింది. ఇంద్రజిత్ గుప్త నియామకం ఆయన ఏకంగా హోంమంత్రిగా నియమింపబడ్డాడు అందుకోసం ఆయన పార్టీ అయిన సి.పి. ఐ.చాలా వత్తిడి తెచ్చిందట. ఆయన మీద వ్యక్తిగతంగా భ్రష్టాచారపు ఆరోపణలు లేవు. కాని ఆయన పార్టీ ప్రతిష్ఠ విషయం ధర్మపరంగా ఆలోచనీయమవుతుంది.

ఆయన పార్టీని పంచమాంగదళం అంటుండేవారు. ఆ పార్టీకి వ్రేళ్లు భారతదేశం వెలుపల ఉన్నాయనేవారు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ (Its roots are out side India) స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులకు అండగా నిలిచిన పార్టీ అది అనేవారు. దేశ విభజన కోసం ముస్లింలకు అండగా నిల్చింది. భారత్ పై చైనా దాడి చేస్తే వారికి ఏ మంత బాధ కలుగలేదు. కాశ్మీర్‌పై పాక్ మూకలు దాడిచేస్తే బాధకలుగలేదు సరికదా. ప్లెబిసైట్ (జనవాక్య నిర్ధారణ) జరపాలంటూ శాంతి సంఘాల పేరిట ప్రచారం చేసిన పార్టీ అది దానిని కాంగ్రెసు వెలివేసింది. అప్పటి హోంమంత్రి సర్దార్ పటేల్ దానిని దూరంగా ఉంచారు. ఎమర్జెన్సీ సమయంలో ఎందరో కాంగ్రెసు వారు ఇందిరా గాంధీకి దూరంకాగా, ఇందిరా గాంధీ అండన నిల్చింది ఈ పార్టీయే. అప్పట్లో జయప్రకాశ్ నారాయణ నేతృత్వంలో ఏర్పడిన జనతా పార్టీకూడా దీనిని దూరంగా ఉంచింది. గాంధీజీని గురించి వీరు అప్పుడప్పుడు గౌరవం ఉన్నట్లు మాట్లాడుతారు గాని – గాంధీజీకి రియాక్షనరీ అని పేరు పెట్టి, అంతర్జాతీయ కమ్యూనిష్టు సభలో విమర్శలు దట్టించి, గాంధీజంపై పోరాటం జరపాలని అన్నది వీరే. అసలు శాంతియుత పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై వీరి విశ్వాసమూ ప్రశ్నార్థకమే. రక్తపాతమూ, విప్లవమూ వీరి పిలుపులు. నక్సల్ బరీ – నక్సలైట్స్ – ఆగడాలకు మూలం వీరి సిద్ధాంతం. ''మా చేతులు బుల్లెట్లలోనూ దిట్టమే..బాలెట్లలోనూ

దిట్టమే''. (Our hands are strong with bullets and ballets) అంటూ కవిత్వాలు పలికింది వీరి నేత శ్రీ ఎస్.ఎ. డాంగే. ఈ దేశ సంస్కృతినే తుడిచి పెట్టి తమ సిద్ధాంత సంస్కృతిని నిలపాలని ప్రయత్నిస్తూ వచ్చినవారు రాష్ట్రంలో ఇలాగే చేసి భంగపడ్డారు. అంత దాకా ఎందుకు? వీరి నామకరణంలోనే వీరి వైఖరి వ్యక్తమయింది. 1926 ప్రాంతంలో ఈ పార్టీకి ఏమి పేరు పెట్టాలనే ప్రశ్న వస్తే మామూలుగా ''భారతీయ కమ్యూనిష్టు పార్టీ (Indian Communist Party) అని పెద్దామన్నారు సలువురు. ''భారతీయ'' అనే గుణాత్మక విశేషణానికి వీల్లేదని, ఇక్కడ ఉండి, బ్రతుకుతున్నాం ఏనుక ''భారత కమ్యూనిష్టు పార్టీ'' (కమ్యూనిష్టు పార్టీ ఆఫ్ ఇండియా) అందామని మూడు రోజులు పోరాడి ఆ పేరు పెట్టుకున్నారు. అలా ఈ జాతికి, జాతీయతకు, సంస్కృతికి, దేశ అఖండతకు అల్లంత దూరాన బ్రతికే ఈ మస్తిష్క వంతులు ఈ జాతికి నాయకత్వం వహించడమా? కేంద్రంలో మంత్రిత్వం వహించడమా? సర్దార్ పటేల్ వంటి వారు నిర్వహించిన గృహమంత్రిత్వ శాఖను నిర్వహించడమా? విపరీతం కదూ?

పోనీ వర్తమాన విషయాల్లో చూద్దామంటే, అదో అల్లరి, అరాచకత్వము. మతాలన్నీ మత్తుమందులని అందరినీ నిందిస్తూ ఉండేవారు హిందువులకుగాని ముస్లింలకు గాని మరే మతస్తులకు గాని మిత్రులు కాజాలరు. వారికి మందిరమూ అక్కరలేదు. మసీదు అక్కరలేదు. కేవలం అల్లరి కోసం అందరికన్న ఎక్కువగా బాబ్రీ పేరిట కాకి గోల చేసింది వీరు. దేశంలో సిద్ధాంతపరమైన సమరం జరుగుతోంది (Battle of Idealogy) అని లోకసభ చర్చల్లో అన్నది ఈ ఇంద్రజిత్ గుప్త. అది హిందుత్వంపై వారు జరుపుతున్న సమరానికి సిద్ధాంతం పేరుతో బుర్ఖా..ముస్లింల మద్దతు కోసం జరిపే రాజకీయం. అందుకే బంగ్లా ప్రచ్ఛన్న ప్రవేశకుల గొడవ వీరికి పట్టదు. కాశ్మీర్ ఉగ్రవాదులకు అధిక అటానమీ ఇవ్వాలట. బలగాలతో హిందుత్వంపై సమరాలు, యుద్ధాలు జరపాలనే వారు అందరిని కూడగట్టుకొని హోంశాఖను నిర్వహించడమా? శ్రీ గుప్తా చాలా కాలం పార్లమెంటులో ఉన్నారని, లా పాయింట్లు బాగా తీస్తారని ఏమిటేమిటో చాలా ప్రచారాలు చేస్తారు. వస్తూనే అయోధ్య విషయాన్ని రాజ్యాంగపు 138 (2) అధికరణం క్రింద సుప్రీంకోర్టుకు అప్పగించి, రోజువారీ కోర్టు వాయిదాలు నడిపి, ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల లోగానే తేల్చిపారవేస్తానని ప్రకటించాడయన. ఉత్తరప్రదేశ్‌లో ఒక ప్రభుత్వం అనేది ఉంటేగాని, ఒక శాసనసభ ఉంటేగాని, పార్లమెంటులో తీర్మానం చేస్తేగాని, సుప్రీంకోర్టుకు అప్పగించడం సాధ్యం కాదని, అప్పగించిన తర్వాత కేసు సంవత్సరాల తరబడి సాగుతుందని, అది ఈ శతాబ్దాంతంలోగా జరిగేది కాదని, ఫలాని తేదీలోగా ఈ కేసు తేల్చాలని కోర్టుకు ఆదేశించే అధికారం తనకు లేదనీ, అసలు ఈ వివాదంలో తేల్చవలసింది ఏదో లీగల్ పాయింట్ కాదనీ, చారిత్రక సాక్ష్యాల నిరూపణకు సుప్రీంకోర్టు వద్ద సముచిత యంత్రాంగం లేదనీ, అట్టిది సృష్టించినా ఆ నిరూపణ వీరు చెప్పే అసెంబ్లీ ఎన్నికలలోపు జరపడం అసాధ్యమనీ ఇందులో ఏదీ తెలియదీయనకు! తెలియకనా? తెలిసి కూడా ప్రజలకు మస్కా వేసెందుకు ఆ మాట అన్నారా? ఏమో!

నల్గురూ మందలించిన మీదట – ఈ ఝంఝూటం ఇప్పుడెవరు పెట్టుకుంటారు? సంప్రదింపుల ద్వారా పరిష్కరిస్తాం అంటున్నారిప్పుడు! నవ్విపోతుంది ప్రపంచం. దేవెగౌడ ఈయననెలా పెట్టుకున్నట్లు? దీనివల్ల ఆ శాఖకు, దేశానికి, భద్రత, ప్రతిష్ఠ ఉంటుందా? దేవెగౌడ నావరించిన వత్తిళ్లకు ఎవరైనా జాలిపడితే పడవచ్చు! కాని దేశానికి, ధర్మానికి జరుగగల నష్టానికి ఎలా జాలిపడగలం? వానిని రక్షించుకోవడం ఎలా?

– శ్రీ ధర్మ ప్రియ

# తెలుసుకుందాం

(1) అట్లాంటా ఒలింపిక్స్‌లో ఎన్నిదేశాలు పాల్గొన్నవి?

(2) అట్లాంటా ఒలింపిక్స్‌లో మనదేశానికి ఏ మెడల్ వచ్చింది? క్రీడాకారుడెవరు?

(3) భూమి నుండి సూర్యుని దూరమెంత?

(4) అజంతా చిత్రనిర్మాణమెపుడు?

(5) వీరేశలింగం పంతులు గారి జననం ఎపుడు?

(6) ప్రపంచంలోకల్లా అత్యంత రద్దీగల బ్రిడ్జి ఏది? ఏ దేశంలో?

(7) బృహదీశ్వరాలయం ఎక్కడుంది? దాని ఎత్తు ఎంత?

(8) 'దేవపుత్ర' బిరుదుగల రాజెవరు?

(9) ప్రతాప్‌సింగ్ మ్యూజియం ఎక్కడుంది?

(10) భారత కాలమానం మ॥ 12 గంటలపుడు కరాచీలో టైమ్ ఎంత?

(11) సముద్ర మట్టానికి హైద్రాబాద్ ఎంత ఎత్తులో ఉంది?

(12) మొల్ల, మొల్ల రామాయణ కర్త కాలం ఏది?

(13) తెలుగులో మొదటి నాటకమేది? కాలం?

(14) 'స్పిరిట్ ఆఫ్ రిలిజియన్' గ్రంథకర్త ఎవరు?

(15) 'సిజర్స్' ఏ ఆటలోని పదం?

(16) 1995లో ధన్వంతరి అవార్డు గ్రహీత ఎవరు?

(17) B.K.S. అంటే?

(18) ఫౌంటెన్ పెన్ కనుగొన్నదెవరు?

(19) పింక్ సిటి ఏది?

(20) 'హ్యూమన్ కంప్యూటర్'గా పేరొందిన వ్యక్తి ఎవరు?

**జవాబులు :**

(1) 197. (2) బ్రాంజ్‌మెడల్, పేస్. (3) 9కోట్ల 30 లక్షల మైళ్ళు. (4) క్రి.శ. 600. (5) 1848. (6) హౌరా బ్రిడ్జి, భారత్‌లో. (7) తంజావూరు, 216 అ. (8) కనిష్కుడు. (9) శ్రీనగర్. (10) ఉ॥ 11-30. (11) 600 మీ. (12) 1526. (13) మంజరీ మధుకరీయము - 1860. (14) యస్. రాధాకృష్ణన్. (15) కుస్తీ. (16) బృహస్పతిదేవ్ త్రిగుణ (17) భారతీయ కిసాన్ సంఘ. (18) వాటర్‌మాన్. (19) జైపూర్. (20) శకుంతలాదేవి.

కథానిక

# ప్రాప్తం

(గతసంచిక తరువాయి)

— డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి
రాష్ట్రకవి

చూడు బాబూ! ఇదిగో యీ చెట్టు క్రింద కూర్చుని కాసేపు నేను వ్రాసిన కవిత్వాన్ని వినిపిస్తాను. నీ యభిప్రాయం చెబుదువుగాని రా! అంటూ వెళ్ళి ఆ చెట్టు క్రింద కూర్చుని యేనాడో తాను వ్రాసిన పద్యాల్ని, గేయాల్ని వినిపించటం మొదలుపెట్టాడు.

వాస్తవానికి చక్రవర్తికి యిదంతా చాలా యిబ్బంది కరంగానే ఉన్నది. తనకు సాహిత్యాన్ని గూర్చి స్థూలంగా కొంత అవగాహన ఉన్నా కవిత్వాన్ని గూర్చి మాత్రం అంతలోతుగా తెలిసిన వాడుకాదు. పైగా మరీ యీకవి కండూతి యేమిటీ? దానికి తోడు కాస్త వృద్ధాప్యపు చాదస్తం గూడ! విసుగ్గా ఉన్నది చక్రవర్తికి. అది పసిగట్టిన కవిగారు కాస్త తమాయించుకొని యిదిగో, ఇందాక నీవు చదివితివే, ఆగేయం పూర్తిగా వినిపిస్తాను విను, అని చాలా పొందికగా, ఒద్దికగా, వార్ధక్య సహజ బలహీన మాధుర్యాభరితగళస్వరంతో పాడినట్లు చదివి వినిపించాడు.

చక్రవర్తి ఆశ్చర్యపోయి ఇది యెవరు వ్రాసిన గేయం సార్! ఇంత బాగా ఉన్నది! చదివిన పద్ధతి గూడ అద్భుతంగా ఉన్నది! మీకునోటికి రావటమేగాక ఇంత పాతకాగితం మీద సిద్ధంగా వ్రాసిపెట్టిగూడా ఉన్నది! అని కుతూహలంతో ప్రశ్నించాడు.

ఎప్పుడో కొన్ని సంవత్సరాల నాడు నేను వ్రాసిన ఖండికేనయ్యా! యిది. ఇలాంటివి యింకాచాలా ఉన్నాయి. అన్నాడు కవిగారు. మఱిపుస్తకం వెయ్యలేదా అన్న ప్రశ్నకు లేదు: ఏదో కొన్ని చిన్న చిన్న పత్రికల్లో పడటమే గాని పుస్తకమంటూ వేసుకోలేక పోయాను. నేను బాగా బతికిన రోజుల్లో నాకు కవిత్వ రచనా ధోరణి అబ్బలేదు. అది అబ్బిన నాటికి నా ఆర్థిక పరిస్థితి చితికిపోయింది. అందువల్ల నా కవితలు అంతఃపురస్త్రీలవలె అసూర్యం పశ్యలుగా మిగిలి పోయినవి. పోనీ, యేదో తంటాలు పడి ఓ పుస్తకం వేయిద్దామనుకుందాం: మనమేమన్నా మహాకవులమా పాఠకులు ఎగబడి కొని చదవటానికి! అనవసరం! అని విచిత్రంగా సమాధానమిచ్చాడు వృద్ధుడు.

ఆ తర్కం చక్రవర్తికి బొత్తిగా నచ్చలేదు. ఎవరికి చేతనైన పని వాళ్ళు చేయాలి. దానికి లోకంలో ఏదో ఒక విధమైన గుర్తింపు, రాణింపు వస్తుందన్న ఆశతో మనుగడ సాగించాలి. మఱి ఆయన వ్రాసిన గేయకవితే గదా తన హృదయానికి హత్తుకొన్నది. తనలాంటి వారు మఱి కొందరుండవచ్చు గదా! అని మనస్సులో అనుకొని అయినా ఆ వాదాన్ని పొడిగించటం ఇష్టం లేక ఎన్ని సార్లు అడిగినా మీరు సూటిగా చెప్పకుండా దాటేస్తూ వచ్చారు: ఇంతకూ మీ పేరేమిటి సార్! అని అడిగాడు.

పేరు ఏదైతేయేమిటోయి! ఇంతకు పూర్వం మనకు పరిచయం లేదు: పేర్లు కూడా తెలియవు. అందువల్ల మనకు వచ్చిన నష్టం గాని పోయిన లాభం గాని యేమి లేదు. ఇకముందు కూడా అంతే. ఒకవేళ యేమహారథి అనో, రమణమూర్తి అనో చెప్పావే అనుకో దానివల్ల నీకుగాని ప్రపంచానికి గాని ఒరిగేదేమిటి గనుక? ఇక్కడ నీకొక చమత్కారం చెబుతాను. విను! వివేకానందుడు పూనాలో తిలక్ గారియింట్లో ఆయన అతిథిగా ఓ వారం పదిరోజులున్నాడు. తిలక్‌ను గూర్చి వివేకానందుడికి తెలుసు. అప్పటికే ఆయన సుప్రసిద్ధుడు. అయితే వివేకానందుణ్ణి గూర్చి తిలక్ గారికి యేమీ తెలీదు. సంప్రదాయ మర్యాదననుసరించి తిలక్ వివేకుని పూర్వాశ్రమ జీవితాన్ని గూర్చి గాని, పేరును గూర్చిగాని, ప్రస్తుత జీవన విధాన విషయాన్ని గూర్చిగాని అడగదల్చుకోలేదు.

వివేకానందుడు కూడా బైటపడలేదు. చికాగో ఉపన్యాసాలతో గుప్పుమన్న ఆతనిపేరునుచూసి, పత్రి కల్లో బడిన ఫొటోలు జూసి యితడా వివేకానందుడు! అని ఆశ్చర్యచకితుడైనాడట తిలక్! ఇదిగో, మన పేరు ప్రపంచానికి తెలియదన్నా, తెలుసునన్నా యిలా ఉండాలి! అంతే గాని పెద్ద పెద్ద పేర్లు పెట్టుకొని ప్రయోజనమేమిటి! దండగ! అన్నాడు కవి.

బావుంది సార్, మీవరస. అసలు మనకీ వాళ్ళకీ పోలికేమిటి! మనం వాళ్లై పోముగదా! మన స్థాయికి తగ్గట్టు మనమాలోచించాలిగాని ప్రతి దానికీ యిలా తర్కిస్తూ పోతే తేలేదెప్పటికి? అన్నాడు చక్రవర్తి.

మనం వాళ్ళమే అయిపోవటం అసంభవమేనయ్యా, నీ వన్నట్లు కనీసం వాళ్ళ అనుయాయులమైతే చాలు మనబతుక్కి. ఇంకా చెప్పాలంటే వాళ్ళమీద పూలు చల్లక పోయినా రాళ్ళు రువ్వకుండా ఉంటే చాలు: అదే పదివేలు! గాంధీ మహాత్ముడు సుభాష్ చంద్రబోసుల విషయమే తీసుకుందాం.

అని ఆయన గారు వాళ్ళ పేర్లెత్తంగానే వినాలన్న ఉత్సాహం తీవరిస్తున్నా ఒక పట్టాన వదలడన్న ఉద్దేశంతో కాస్త టాపిక్ మార్చటానికి అది ఛాన్సుగా భావించి మీరు స్వాతంత్ర్య సమరయోధులాసార్! మీ ధోరణి చూసినా, వేష భాషలు చూసినా అనుభవాలూ, జ్ఞాపకాలూ గమనించినా ఔననిపిస్తున్నది! అన్నాడు చక్రవర్తి.

అంతే, మళ్ళీ లంకించుకున్నాడు వృద్ధుడు: ఔను, స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని చిరకాలం శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించి వచ్చిన వాణ్ణే. మాతాత గారు చికాగోలో వివేకానందుడూదిన భారతీయ సంస్కృతి శంఖధ్వానం విన్న పిమ్మట పులకితగాత్రుడై ఆ తరువాత కొద్ది కాలానికే రగులు కొన్న ''వందే మాతరం'' ఉద్యమంలో పాల్గొన్నధన్యజీవి. మాతండ్రి గారు తిలక్ గారి ''స్వాతంత్ర్యం నాజన్మ హక్కు'' అన్న సింహగర్జనవిని ఉత్తేజితుడై ఆ వరుసలో సాగిన ''హోంరూలు'' ఉద్యమంలో పాల్గొన్న భాగ్యశాలి. ఇక నేను గాంధీ గారి ''క్విట్ ఇండియా'' అన్నగర్జాఘోషకు, సుభాష్ చంద్రుని ''జై! హింద్'' సింహనాదానికి స్పందించి, విజృంభించి స్వాతంత్ర్యం వచ్చినదాకా సమరం సాగించిన అదృష్టవంతుణ్ణి! ఈవిధంగా నాదేహంలో ప్రవహిస్తున్న నా తాత, తండ్రుల రక్తంలో నాజాతి పూర్వ మహాపురుషుల తేజః ప్రవాహం మిళితమై పొంగులు వారుతున్నది!... ఆ రోజులు తల్చుకుంటే యెదకరిగి ప్రవహిస్తుంది. అంటూ బొట బొట అశ్రుతర్పణం విడిచాడు వృద్ధుడు.

వారి సంభాషణ క్లైమాక్సుకు చేరుకున్నదనటానికి రూపకంగా చక్రవర్తి గూడా చలించిపోయి భావావేశానికి గురియై బొట బొట ఆనంద బాష్పాలు రాల్చాడు! ఒక్క నిముషానికి తేరుకొన్న పిమ్మట అతనికొక ధర్మసందేహం వచ్చింది. ఈయన ప్రభుత్వం వారు ప్రసాదిస్తున్న స్వాతంత్ర్య సమర యోధుల పించను పొందుతున్న వ్యక్తియా! పొందని వ్యక్తియా! అని ఆతని ధోరణిని బట్టి, తన వివేకంతో పొందని వ్యక్తి అన్న భావం కలిగింది. ఆవిషయం అడుగుదామనుకొని యెందుకొచ్చిన గొడవలే అని భావించి విరమించుకున్నాడు. అయితే స్వతంత్రం రావటానికి ముందున్న పరిస్థితులకు, వచ్చిన తరువాత నెలకొన్న పరిస్థితులకు తులనాత్మక దృష్టితో సమన్వయాత్మక విధానసూచకంగా ఏదైనా చెప్పమని అడిగాడు చక్రవర్తి.

చూడుబాబూ! అప్పటి మనలక్ష్యం విదేశీపాలనను అంతమొందించి స్వతంత్రంసంపాదించుకోవటం. ఇప్పటి మన లక్ష్యం మనదేశంలో జడలుగడుతున్న

విదేశీసంస్కృతివ్యామోహాన్ని అంతమొందించి, వచ్చిన స్వాతంత్ర్యాన్ని నిలుపుకొని దేశాన్ని కాపాడుకోవటం. అందుకోసం అప్పుడు స్వదేశీ ఉద్యమం, జాతీయ విద్యావిధానం వంటి యెన్నో ఆందోళనలు జరిగినయి. ఆ ఉద్యమాలన్నీ మళ్ళీ యిప్పుడు చేపట్టవలసిన అవసరమున్నది. దేశ సమగ్రత, జాతీయ సమైక్యత, సంస్కృతీరక్షణ, రామరాజ్యం- ఇవీ మన ఆశయాదర్శాలు. వీటిని సాధించటానికి మీయువతరం ముందుకురావాలి. ఇంతకుమించి చెప్పవలసిందేమున్నది! అన్నాడు వృద్ధుడు.

నిజానికి చక్రవర్తికి యివన్నీ తెలియని విషయాలు కాదు, అయితే మళ్ళీ ఒకసారి నూతనోత్తేజం పొందినట్లయింది. ఇంకా ఈ సమావేశానికి భరతవాక్యం పలకాలనుకొని, ఇంతకూ ఇప్పుడు మీరెక్కడికి వెళ్ళాలి సార్, అని మాట మార్చాడు చక్రవర్తి.

చూడునాయనా! నీవు నాదోవన నన్ను పోనీయకుండా ఆపి నాకవిత్వాన్ని నాకే వినిపించి నా ప్రయాణానికి కళ్ళెం వేశావు. తీగెకదిపితే డొంకంతా కదులుతుందన్నట్లు మొత్తం మీద యీచర్చంతా చేశాం. ఇప్పుడు చెబుతున్నాను విను, నా పేరు మహారథి, విజయవాడ వెళ్ళవలసినవాణ్ణి. ఈ పాటికి ట్రైను వెళ్ళిపోయి ఉంటుంది. ఎందుకువెళ్ళదు? మనకోసం ప్రపంచం ఆగుతుందా యేమిటి? ఎట్టి పరిస్థితిలోను ఇవాళ ప్రయాణం చేసి రేపు తెల్లవారేటప్పటికి విజయవాడలో ఉండాలి అక్కడ అర్జంటు పని ఉన్నది. అంటూ హడావిడిగా పదడుగులు వేశాడు మళ్ళీ వెనక్కి తిరిగివచ్చి చూడు బాబూ! ఏమీ అనుకోవద్దు; ఒక్క పదిరూపాయలుంటే యిస్తావా? వెంటనే ఆటోమీద వెళ్ళిపోతే తప్పకుండ ట్రైను దొరుకుతుంది. నీవిచ్చిన పదిరూపాయలతో ఆటోమిద స్టేషన్‌కి వెళ్ళిపోతాను. నాదగ్గఉన్నడబ్బు రైలు టిక్కెట్టుకు సరిపోతుంది. నీవిచ్చిన పండుతిని యే కాజీపేట స్టేషన్‌లోనో యిన్ని నీళ్ళు త్రాగితే సరిపోతుంది. తెల్లవారేటప్పటికి మాయింట్లోనే ఉండి పోతానేమో! అన్నాడు చాలా అమాయకంగాను నిర్మలంగాను.

వెంటనే చక్రవర్తి జేబులోంచి పదిరూపాయలు తీసి యిదిగో సార్ తీసుకోండి అని యిస్తూ -తనదగ్గఅ ఇంకొక పదిరూపాయలు మాత్రమే ఉన్నాయి, పోనీ అవికూడ ఇద్దామనుకొని, తన దగ్గఅ పదిమాత్రమే ఉన్నాయని చెప్పకుండ - ఆ పదిరూపాయలు కూడా తీశాడు ఇవ్వటానికి. కాని ఆయన అక్కర్లేదు బాబూ! నాకు పదిరూపాయలే చాలు; అంటూ ఆ యిచ్చిన పదిరూపాయలు మాత్రమే తీసుకొని హడావిడిగా జేబులోంచి చిన్నకాగితము, పెన్నుతీసి నీ అడ్రసు చెప్పు నాయనా! వెళ్ళంగానే పంపుతాను అని అడిగాడు. పంపక్కర్లేదు లెండి, పది రూపాయలేగా, అదిగో ఆటోవాడు వస్తున్నాడు. అందులో వెంటనే వెళ్ళిపోండి స్టేషన్‌కి అంటూ ఆటోను కేకేశాడు. వృద్ధుడు చెమ్మగిల్లిన కళ్ళతో కృతజ్ఞతలు తెలియజేస్తూ చూడు నాయనా! నాకవిత్వం నాకు వినిపించి నాకు ఇంకొక పదేళ్ళు అధికంగా ప్రాణం పోశావు. మంచి పండిచ్చావు, డబ్బిచ్చావు,.అన్నిటికీ మించి హృదయ మిచ్చావు. ఇది యేనాటి ఋణం! అని ప్రశ్నార్థక చిహ్నం చిత్రించి గబాగబా ఆటోయెక్కి వెళ్ళిపోయాడు!

చక్రవర్తి ఆటోకనుమరుగైపోయేదాక అలాగే చూస్తునిలబడి, దాదాపు ఆ రెండు గంటల కాల పరిధిలో జరిగిన ఘట్టాన్ని ఒక్కసారి నెమరు వేసుకొని, ఎప్పుడు, ఎక్కడ, ఎవరికి ఏది ఏవిధంగా ప్రాప్తమో యెవరు చెప్పగలరు? నా అదృష్టం కొద్దీ యీ మహనీయుని బోధనన్ను కార్యోన్ముఖుణ్ణి చేస్తున్నది. అనుకుంటూ తేలిక బడిన మనస్సుతో కదిలిపోయాడు.

(అమృతవాణి) | **సింహం, కొంగ, కోడి, కాకి, కుక్క, గాడిద.**

శ్లో॥ సింహాదేకం, బకాదేకం శిక్షేచ్చత్వారి కుక్కుటాత్
వాయసాత్పంచశిక్షేచ్చ షట్ శునస్త్రీణి గర్దభాత్॥

సింహం తన వేట తానే ఆడుతుంది. ఇతరులమీధ ఆధారపడదు. అలాగే మనిషి చిన్నపనైనా పెద్ద పనైనా స్వయంగా చేసుకోవటం వుత్తమం. ఇది సింహంలో వున్న ఒక మంచి గుణం.

అలాగే కొంగ ఒంటికాలిమీద నిలబడి తానున్న దేశ కాలాలు గుర్తిస్తూ ఏకాగ్రతతో చేప కోసం వేచివుండి యిట్టే పట్టేస్తుంది. అలాగే వివేకవంతుడు దేశ కాల పాత్రాదుల్ని తెలిసికొని ఇంద్రియ నిగ్రహంతో కార్యసాధన చేసుకోవాలి.

కోడిలో నాలుగు గుణాలున్నాయి. పెందరాడె మేల్కోటం, పట్టుదలతో ప్రాణాలు లెక్కచేయకుండా శత్రువుతో పోట్లాడటం, తనవాళ్ళ నందరిని వెంటపెట్టుకొని ఆహారం సమానంగా పంచుతుంది. అంతేకాక తినే ఆహారాన్ని పరిశీలించిగాని తినదు.

మానవుడు కూడా బ్రాహ్మ ముహూర్తంలో మేల్కొనాలి. దేశం కోసం ప్రాణాన్ని తృణప్రాయంగా భావించాలి, తనకు కలిగినదాన్లో తోటి మానవులకింత సంపెట్టాలి, పరిశుభ్రమైన ఆహారాన్ని తినాలి. ఈ నాలుగూ యెంత మంచి గుణాలు!

ఇలాగే కాకి తన ఆడకాకితోటి ప్రేమ సంబంధాన్ని చాలా గూఢంగా వుంచుతుంది. చాలా ధైర్యంగా జీవనం గడుపుతుంది. ప్రతి క్షణం తన ఆహార సంపాదనకోసం ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఎవరినీ నమ్మదు. తాను మాత్రం ఎప్పుడూ అప్రమత్తంగా వుంటుంది. ఈ ఐదు గుణాలూ మనిషి గమనించటం మంచిది. గూఢంగా ఉండాల్సిన దాంపత్యధర్మం బజారెక్కకూడదు. జీవితంలో అధైర్యం పిరికి లక్షణమౌతుంది – సంపాదించేటప్పుడు ప్రతి పైసా కూడబెట్టాల్సిందే. తొందరగా ప్రతివాణ్ణీ నమ్మి మోసపోకూడదు. తానెల్లకాలం అతి జాగ్రత్తగా ప్రవర్తించాలి. నిజానికి ఇవన్నీ యెంత మంచిగుణాలో చూడండి.

కుక్కకూడా తక్కువది కాదు. కడుపునిండా తింటుంది. ఎంత కొంచెం పెట్టినా తృప్తి పడుతుంది. హాయిగా నిద్రపోతుంది. కాని చీమ చిటుక్కుమంటే లేచి చూస్తుంది. దానికున్న స్వామిభక్తి దొడ్డది. దాని శౌర్యం ఎంతదో మనకు తెలుసు.

మనిషికూడా పుష్టిగా తినాల్సిందే, అలాగే అల్పసంతోషి కావాలి. రోజూ గాఢనిద్ర పోవటం ఆరోగ్య హేతువు. అలాగని బండనిద్ర కాదు. వెంటనే మేల్కొనే స్వభావం వుండాలి. పెద్దల విషయంలోను, ప్రభుత్వ విషయంలోను భక్తిశ్రద్ధలు చూపించాలి. శౌర్యంతో వ్యవహరించాలి సమయం వచ్చినప్పుడు ఈ ఆరుగుణాలు అలవాటు చేసుకోదగినవి. ఇక గాడిద విషయం ఆలోచిద్దాం అది యెంత అలసిపోయినా భారం మోస్తూ బాధ్యత నిర్వర్తిస్తుంది. శీతోష్ణాలను లెక్కచేయకుండా సహనం వహిస్తుంది. ఎప్పుడు చూచినా సంతోషమేగాని దానికి విచారమనేది వుండదు.

ఈ మూడు గుణాలు మనిషికి యెంత అవసరాలో తెలుస్తూనే వుంది కదా!

చాణక్యుని యీ పరిశీలనం మానవజాతి జీవనంలో ఒక చక్కని ప్రబోధం.

– శ్రీ కూచిభట్ల చంద్రశేఖర శర్మ

# శ్రీపాకలపాటి గురువులు (1911-1970)

- ఆచార్య బి. రామరాజు

పరమాత్ముని వ్యక్తరూపం ప్రకృతి. ఆ ప్రకృతిలో పరమాత్ముని దర్శించే యోగులు కొందరు. ఆ ప్రకృతితో తాదాత్మ్యం పొంది దాని ప్రశాంత గాంభీర్యాది గుణాల సారూప్యం పుణికి పుచ్చుకొని పరమాత్మునికే ప్రాతినిధ్యం వహించే యోగులు కొందరు. అట్టి మహాపురుషుల్లో శ్రీపాకలపాటి గురువులొకరు. 1970 దాకా సజీవులుగా ఉండిన శ్రీపాకలపాటి గురువుల జీవిత విశేషాలు శ్రీ ఎక్కిరాల భరద్వాజ గారి మూలంగా మనకు దక్కినవి. గురువుగారు శా.శ. 1833 విరోధికృత్ జ్యేష్ఠశుద్ధపౌర్ణమి ఆదివారం జ్యేష్ఠానక్షత్రంలో 11-06-1911 నాడు పుట్టినట్లు శ్రీభరద్వాజగారు పేర్కొన్నారు. ఆ యిరువురు 18-09-1966 నాడు కలుసుకున్నప్పుడు, భరద్వాజగారి ప్రశ్నకు సమాధానంగా తమ వయస్సు అప్పటికే 70 ఏండ్లపైన ఉంటుందనీ, తాము పుట్టిన సంవత్సరం తమకే తెలియదనీ గురువుగారనటం చేత వారు 1895 సంవత్సరంగాని అంతకు ముందు గాని పుట్టినట్లు ఊహించవచ్చు.

పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు-జంగారెడ్డి గూడెం దారిలో ముండూరు అగ్రహార వాస్తవ్యులు, శ్రీవత్సగోత్రీకులు, దామరాజు గంగరాజు వెంకమ్మ అనే ఆరువేల నియోగి దంపతుల మూడవ సంతానం వెంకటరామయ్యయే పాకలపాటి గురువులు. సోమేశ్వరరావు విశ్వేశ్వర రావులు ఆయన అన్నలు. ఆరు మాసాల ప్రాయంలో తల్లిని, తొమ్మిదవ యేట తండ్రిని, కోలుపోయిన వెంకటరామయ్య ప్రాథమిక విద్య మేనత్త రామాయమ్మ పర్యవేక్షణలో స్వగ్రామంలోను, తరువాత 8వ తరగతిదాక మోతేవారి సత్రంలో ఉంటూ ఏలూరులోను సాగింది. ఆ లేత వయస్సులోనే వెంకటరామయ్య దాంభికులు స్వార్థపరులైన పెద్దలను సంస్కరించే ప్రయత్నం చేసినాడు. అపార గ్రహణ ధారణ శక్తులతో పండితుల మన్ననలందుకున్నాడు. ఏ పూర్వ జన్మానుబంధమో గారపాటి పుల్లయ్య గారనే కమ్మ భూస్వామి వెంకటరామయ్యను చేరదీసినాడు. వెంకటరామయ్య పుల్లయ్య గారి తల్లి ఇచ్చే స్వయం పాకంతో తానే వండుకొని తినేవాడు. బాల్య స్నేహితుడు పలపాల సూరన్నతో కలిసి తిరిగేవాడు. బంధువులు సాటి బ్రాహ్మణ్యము కులభ్రష్టుడైనాడని వెంకటరామయ్యను వెలివేసినారు. జగద్బంధువు కానున్న వెంకటరామయ్య నామ మాత్రపు బంధువుల ఆంక్షలు లెక్కచేయలేదు. అగ్రజన్ముడనే కారణంగానో మరెందుకోగాని పుల్లయ్య పేరుపెట్టి పిలువకుండా బాబుగారని పిలవటంచేత తల్లిదండ్రులు పెట్టిన వెంకటరామయ్య అనే పేరు మరుగున పడిపోయి బాబు గారనే పేరే ప్రచారంలోనికి వచ్చింది.

బాబు గారు కైకరంలో ఉన్న భూమిని అమ్మితే, ఒక పెద్దమనిషి ఆ డబ్బు దక్కించుకున్నాడు. పుల్లయ్య ఆ డబ్బు మరల బాబు గారికిప్పించి ఆపద్బాంధవుడైనాడు. ఆ డబ్బుతో బాబుగారు బొంబాయికి పోయి వింతలు విశేషాలు చూచి వట్టి చేతులతో తిరిగి వచ్చి పుల్లయ్య గారింట్లోనే ఉన్నాడు. ఒకనాడు అర్ధరాత్రి బాబుగారు వెక్కివెక్కి ఏడుస్తుంటే పుల్లయ్యగారు దుఃఖ కారణం అడిగితే ''అనాథుడుగా భారపు బ్రతుకు ఈడ్వడం కంటె ఆత్మహత్య చేసుకుంటా'' నన్నాడు బాబుగారు. ఆత్మహత్య మహాపాతకమనీ తానున్నాననీ ధైర్యం చెప్పి ఓదార్చి పుల్లయ్య బాబుగారిని తన ప్రక్కలోనే పడుకోబెట్టుకున్నాడు. ఇద్దరూ నిద్రపోయినారు. తెల్లవారి లేచిచూస్తే బాబుగారు లేడు. తన కనుమొరగి పారిపోయిన బాబుగారిని తలచుకొని ''ఈ బ్రాహ్మణుడు అన్నంతపని చేయకుండుగాక'' అని దేవునికి మ్రొక్కినాడు పుల్లయ్య. బ్రతికి ఉంటే ఎప్పుడైనా కలుసుకోవచ్చుననుకున్నాడు. తాను పడుకున్న ప్రక్కకు కూడా చెప్పకుండా ఆ రాత్రి బాబుగారు

పలపాల సూరన్నతో కలసి ఏలూరు రైలుస్టేషను చేరినాడు. అనుకోకుండా కలకత్తా మెయిల్ అక్కడ ఆగింది. స్నేహితునికి వీడ్కోలు చెప్పి రైలెక్కినాడు. రైలు గోదావరి బ్రిడ్జి పై నుండి పోతుండగా గోదావరిలో దూకుదామనుకున్నాడు, కాని పుల్లయ్య గారి హితోపదేశం స్మృతిలో మెదలి ఆత్మహత్యాయత్నం మానుకున్నాడు. రైలుబండి నర్సీపట్నం చేరగనే టి.టి. వచ్చి టిక్కెటులేని బాబుగారిని చెంపలు వాయించి బయటికి గెంటి ఆంధ్రదేశానికి మహోపకారం చేసినాడు. ఆయన ఆ పనిచేయకపోతే బాబుగారు వంగదేశం మీదుగా ఎక్కడికి పోయేవాడో! ఆయనను తనగడ్డ మీదనే నిలుపుకున్న భాగ్యం ఆంధ్రదేశానికి దక్కించిన ఆ టి.టి. మన కృతజ్ఞతలకు పాత్రుడు.

నర్సీపట్నంలో రైలుబండి దిగిన బాబుగారు గాలిపటం వలె ఊళ్ళు, బిళ్ళు, కొండలు, కోనలు తిరిగినాడు. కొన్ని సంవత్సరాల తరువాత బొబ్బిలి సమీపంలోని కలువరాయి చేరినాడు. ఆ దినాలలో కలువరాయిలో కావ్యకంఠ వాసిష్ఠగణపతి మునులుండేవారు. కావ్యకంఠులు (1878-1936) మంత్రతంత్రజపయోగ సాధనల్లో ఆరితేరిన ఆధునిక బ్రహ్మర్షి. వారి శుశ్రూషలో బాబుగారు అనేక విద్యలను కళలను నేర్చి విధ్యుక్తంగా గాయత్రీ మంత్ర జపానుష్ఠానాలు చేసి మంత్ర సిద్ధులైనారు. పూర్వజన్మల్లో గడించిన సమస్త ఆత్మవిద్యా నిక్షేపాలు ఆయనలో ఆవిష్కృతమైనవి. బాబుగారి ప్రతిభా పాటవాలు లోక విదితమైనవి. ఎదుటివారు ఏదైనా గ్రంథం పుటలు తిరుగవేస్తున్నా గిరగిర తిప్పుతున్నా వారి కండ్లజోడు అద్దాలపై ప్రతిబింబించే అక్షరాకృతులను గమనించి ఆయాపుటల్లోని వ్రాతలు పొల్లుబోకుండా బాబుగారు చదివేవారు. ఆయనది కంప్యూటరు మేధస్సు. ఒక్కసారి చదివినది విన్నది ఆయన మేధస్సులో అంకిత మైపోయేది. తమ కంటబడిన వ్యక్తి జీవితపు లోలోపలి పొరల్లోని గుట్టు బాబుగారు తెలుసుకొనేవారు. ఆయన కన్నుల్లో దివ్యకాంతులు మెరిసేవి; ముఖంలో బ్రహ్మ వర్చస్సు తాండవించేది, విశాల ఫాలం వింతకాంతులీనేది. రోగపీడితులకు మందులు మాకులు, మానసిక వ్యాధి పీడితులకు విభూతి తీర్థములు ఇచ్చేవారు. ఆపదల్లో ఉన్నవారు, వివిధ సమస్యలతో సతమతమయ్యేవారు వచ్చి కూర్చుంటే, చెప్పకుండానే వారికి నివారణోపాయాలు సమాధానాలు చెప్పేవారు.

వింత బాలుడని ప్రసిద్ధిగాంచిన బాబుగారి దర్శనానికి చుట్టుపట్ల గ్రామాల ప్రజలు రావటం మొదలుకాగానే ఆయన ఉన్నట్లుండి ఎవరికీ చెప్పక కలువరాయి విడిచి పోయి ఆసేతుశీతనగం అరణ్యాలు పర్వతాలు నదీనదాలు తీర్థప్రదేశాలు యోగభూములు తిరిగినారు. భారతదేశం బయట త్రివిష్టపం, బర్మా, రంగూన్, సిలోన్ అడవుల్లోని సుందర దృశ్యాలన్నీ చూచినారు. ఈ దేశాల్లో ఆయన చూడని ప్రసిద్ధ పర్వతంగాని అరణ్యంగాని లేవు. ప్రకృతితో ఆయన పొందిన తాదాత్మ్యం చెప్పరానిది. నిద్రాహారాలు మాని అడవులు కొండలు నదులు చూస్తూ వారాల తరబడి పరవశులై ఉండేవారు. ఈ పర్యటనల్లో ఆయన ఆర్జించిన విద్యలనేకం. వేద, ఇతిహాస, పురాణ, సాహిత్య, జ్యోతిష, మంత్ర, మూలికావైద్య, పాకశాస్త్రములన్నింటిలో ఆయన సిద్ధహస్తులైనారు. రమణ మహర్షి, జిడ్డుకృష్ణమూర్తి, టిబెట్ యోగులు, కొత్తలంక యోగి, బాలయోగి, అల్లూరి శ్రీ రామరాజులను కలుసుకున్నారు. ఎందరో శ్రీమంతులు జమీందార్లు బాబుగారిని తమ చెంత నిలుపుకోవటానికి ప్రయత్నించినారు. కాని ఆయన గాలివలె ఎక్కడా నిలువకుండా తిరిగినారు. పట్టణాల కంటె పల్లెలు, పల్లెలకంటె అడవులు, అందులోని గిరిజనులను బాబుగారు ఇష్టపడేవారు. తాము సాధించిన దివ్యశక్తులతో ఆటవికుల బాధలు తొలగించి వారికి ఆరాధ్యులైనారు. రామాయణపారాయణం, రామపట్టాభిషేకోత్సవాలు చేయించటం, అర్హులకు రామమంత్రోపదేశం

చేయటం బాబుగారి కిష్టమైన పనులు. ఆయన అస్ఖలిత బ్రహ్మచారి. భిక్షాపాత్ర ధరించి అప్పుడప్పుడు అడవుల సమీపం గ్రామాలలో తిరిగేవారు.

కలువరాయి విడిచిన తరువాత బాబుగారు బొబ్బిలి సమీపంలోని పిరిడి గ్రామంలో కొంతకాలమున్నారు. అక్కడి యువకులను చేరదీసి భజనలు నేర్పినారు. తరువాత పాలకొండలో ఆరుసంవత్సరాలున్నారు. అక్కడుంటూ టెక్కలి, సాలూరు, బొబ్బిలి మొదలైన చోట్లకు వస్తుండేవారు. బొబ్బిలి సంస్థానం పిల్లలు వీరితో జట్టుగా తిరిగేవారట. 1904 పెద్దగాలివాన వచ్చినపుడు విశాఖపట్నం శివశంకర విలాస్ కాఫీహోటల్లో రెండుదినాలున్నారు. కస్బా జగన్నాథ పురంలో పాలకుర్తి కృష్ణమూర్తి మేడకు శంకుస్థాపన చేసినారు. ఆ శ్రీమంతుడు వడ్డాది మాడుగుల రహదారిపై బాబుగారి కోసం ఒక పెద్ద యిల్లు ఆ యింట్లో పదివేల రూపాయల అమూల్య గ్రంథాలు ఏర్పాటు చేసినారు. బాబుగారిని దర్శించ వచ్చేవారికోసం భోజన సౌకర్యాలు ఏర్పాటు చేసినాడు. మాడుగుల సంస్థానం మేనేజరు కూరుమిల్లి సత్యనారాయణకు బాబుగారిపై అమిత భక్తి. బాబుగారా జమీందారీలోని అడవులన్నీ తిరిగినారు. 1930 - 1931లో బాబుగారు నర్సీపట్నం వచ్చి లంబసింగి ఆశ్రమంలో స్థిరపడ్డారు. కుసర్లపూడిలో ఒక భజన సంఘం స్థాపించినారు. ఏజన్సీ అడవుల్లో ఆటవికులకు లౌకిక పారమార్థిక జ్ఞానం ప్రబోధిస్తూ పెక్కు ఆశ్రమాలు స్థాపించినారు అందులో (1) మఠ్ఠికన్నమ్మ (2) లాలం అప్పలస్వామి (3) అప్పన్న పాలెం (4) కుసర్ల పూడి (5) తానారి పాలెం (6) కిటిమల గాలికొండ (7) భూసురకోట (8) కృష్ణాపురం (9) భీమసింగి (10) నిమ్మగెడ్డ కొత్తూరు (11) నిమ్మగెడ్డ కొబ్బరితోట (12) వెంకట రామాపురం ఆశ్రమాలు ముఖ్యమైనవి. బాబుగారు కిటిమల మొదలుకొని అడ్డసరం వరకు శతాధిక గిరిజన గ్రామాలు సంచరించి గిరిజనుల పాలిటి ఆపద్బాంధవులైనారు.

బాబుగారు ఆ విధంగా అడవిపల్లెలు తిరుగుతుండగా నర్సీపట్నం సమీపాన గల పాకల పాడులో ఒక సంఘటన జరిగింది. ఆ గ్రామంలో శ్రీమద్భాగవతం ప్రవచనం జరుగుతున్నది. పౌరాణికుడు పేరు మోసిన పండితుడు. చింకిగుడ్డలు భిక్షాపాత్రధరించిన బాబుగారు అక్కడికి చేరి ఒక శ్లోకానికి తాత్పర్యం సరిగా చెప్పలేదంటూ అందులోని విశేషాలు అనర్గళంగా మనోహరంగా వ్యాఖ్యానించినారు. సభలోని పెద్దలు, పౌరాణికుడు, బాబుగారు తపస్సంపన్నులైన మహాపండితులని గుర్తించి మర్యాద చేసినారు. పాకలపాడులోనే ఉండి పోవలసిందని ప్రార్థించి ఒక చిన్న ఆశ్రమం నిర్మించినారు. ఏ ఋణానుబంధమో బాబుగారు పాకలపాడులో నిలిచిపోయినారు. ఆనాటినుండి బాబుగారు పాకలపాటి గురువులుగా ప్రసిద్ధులు. కొందరాయనను పంతులు గారనీ, రామయోగి గారనీ కూడ వ్యవహరించేవారు. పాకలపాడు ఆశ్రమంలో బాబుగారు నిరాహారులుగా అనేక మాసాలు కఠోర తపస్సు చేసినారు. నిత్యం ముద్రలతో గాయత్రీ మంత్రజపం విధిగా చేసేవారు. ఎందరో జిజ్ఞాసువులు, భక్తులు వారినాశ్రయించి జ్ఞానులైనారు; కడగండ్లు గడచినారు. పాకలపాటి గురువులు గొప్ప తపశ్శక్తి సంపన్నులనీ, ఆధ్యాత్మిక జ్ఞాన భాస్కరులనీ ఆ ప్రాంతంలో కీర్తి వచ్చింది. వారు నివసించే చోటు చుట్టుపట్ల ప్రకృతి పచ్చపచ్చగా పులకరించేది. భూమి తల్లి పులకరించి పూలు పండ్లు, కూరగాయలు, ధాన్యాలు పుష్కలంగా ప్రసాదించేది. బాబుగారు శాంతమ్మను చేపట్టని అపర ఋష్యశృంగులు. ఋష్యశృంగ మహర్షి మెట్టిన చోటు సుభిక్షంగా ఉండేదని రామాయణకథ. పాకలపాటి గురువులు పాదం పెట్టిన మేర సస్యశ్యామలం అయ్యేది. వారి ఆశ్రమ ప్రాంతంలో క్రూర సత్త్వాలు వన్యమృగాలు తమ తమ సహజ క్రౌర్యాన్ని వైరాన్ని విస్మరించి ప్రశాంతంగా మసలుకొనేవి. ఒకసారి వారు కొండపైన మండుటెండలో తపస్సు చేస్తుంటే దాపట వలపట రెండు పెద్దపులులు బాసటగా నిలిచి ఎండ తగులకుండా తమ తలలను గొడుగువలె పట్టి సేవ చేసినవట. ఆ దృశ్యం ఒక విజయవాడ భక్తుడు కావ్యబద్ధం చేసినాడు.

(సశేషం)

ఆదర్శ జాతీయ కార్మిక దినం

# విశ్వ కర్మ జయంతి

సమాజంలో ప్రతి పనినీ గౌరవించే మనస్తత్వం మనదేశంలో ఏనాటి నుంచో వుంది. శ్రామికుడు, కార్మికుడు అనే ప్రత్యేక వర్గం లేకపోయినా ఎవరి విధిని వారు జీవితాంతం అత్యంత సమర్పణా భావంతో నిర్వర్తిస్తూ వుండేవారు. ''మన విధులను నెరవేరుస్తూ వంద సంవత్సరాలు జీవిద్దాం'' అనేది మన ఆదర్శం అని ఈశావాస్యోపనిషత్ చెప్తున్నది. కాబట్టి ప్రతి వ్యక్తీ శ్రామికుడే! ఈ శ్రమ శక్తిని గుర్తించి గౌరవించే సంకేతంగా విశ్వకర్మ దినోత్సవాన్ని పాటించటం అనేక వేల సంవత్సరాలుగా వస్తున్నది. అయితే ప్రాంతీయ తేడాలవల్ల వివిధ ప్రదేశాలలో వివిధ తేదీలలో ఈ రోజును పర్వంగా జరుపుకుంటున్నా జాతీయ స్వరూపం వున్న ఉత్సవమిది. జమ్‌షెడ్ పూర్‌లోని టాటానగర్‌లో విశ్వకర్మ జయంతిని జీతంతో కూడిన శలవు దినంగా పాటిస్తారు. కమ్యూనిస్టు పాలనలో వున్న పశ్చిమ బెంగాల్‌లో కూడా అనేక పారిశ్రామిక సంస్థలు విశ్వకర్మ జయంతిని కార్మిక దినంగా జరుపుకొంటాయి.

## ఎవరీ విశ్వకర్మ :

నిజమే! చాలా మందికి ఈయనంటే ఎవరో తెలియదు. ఈ రోజుల్లో విశ్వకర్మను కేవలం ఒక వర్గపు దేవతగా మాత్రమే భావించి పూజిస్తున్నారు. కానీ ఈ భావన చాలా అపరాధ పూరితమయింది.

'త్వష్టా' అని కూడా పిలువబడే ఈ విశ్వకర్మ స్వాయంభువ మన్వంతరంలో దేవతలకూ, ప్రజాపతికి శిల్పి. సమస్తకళలకూ, వృత్తులకూ ఈయన మూలపురుషుడు. కమ్మరి, కుమ్మరి, బంగారం, దర్జీ, వ్యవసాయం, మంగలి, చాకలి మొ॥న వృత్తులన్నీ ఈయన ద్వారానే ప్రారంభించబడ్డాయి. భూలోక, స్వర్గలోక నిర్మాతగా ఋగ్వేదం ఈయనను కీర్తించింది.

విశ్వకర్మ భార్యపేరు రచన. విష్ణుభక్తుడైన ప్రహ్లాదుని కుమార్తె కావటాన ఈమెకు ప్రహ్లాదీ, విరోచన, వైరోచని, యశోధర అనే పేర్లు కూడా వున్నాయి. లోక కంటకుడైన వృత్రాసురుడు తపస్సు కారణంగా విశ్వకర్మకు పుత్రుడుగా జన్మించాడు. లోక హితం కోసం కన్న కుమారుణ్ణి బలిచ్చిన ఘనత విశ్వకర్మది. అతన్ని సంహరించటానికి అనువైన వజ్రాయుధాన్ని విశ్వకర్మే నిర్మించి ఇంద్రునికిచ్చాడు. ఈయన త్యాగనిరతి సర్వులకూ ఆదర్శమైంది.

## భారతీయులెవరు? 6.వ పేజీ తరువాయి భాగం

ప్రేమతో బహుప్రయత్నం చేసి సృష్టించాడు. అందుకే మేము ఇంత తెల్లగా వున్నాము' డా. రాధాకృష్ణన్ ఈ దంభోక్తి విని ఒక చిరునవ్వు నవ్వారు. అక్కడ ఉన్న వారిని సంబోధిస్తూ ఆయన ఇలా చెప్పారు – మిత్రులారా! ఒకసారి భగవంతుడికి రొట్టెలు చేసుకుందామని కోరిక కలిగింది. ఆయన రొట్టెలు కాల్చుకునేందుకు కూర్చున్నాడు. మొదటి రొట్టె కొంచెం తక్కువ సేపు కాలింది. దానితో ఆంగ్లేయులు పుట్టుకొచ్చారు. రెండవ రొట్టె కొంచెం ఎక్కువ సేపు కాలింది. దానితో నీగ్రోజాతి పుట్టింది. రెండుసార్లు చేసిన తన పొరపాటును సరిదిద్దుకొని భగవంతుడు మూడవ రొట్టెను కాల్చాడు. అది చక్కగా తగినంత వరకు కాలింది. ఎక్కువ కాలలేదు, తక్కువ కాలలేదు. ఫలితంగా భారతీయులు జన్మించారు.

డా. రాధాకృష్ణన్ ఈ విధంగా భారతీయతను గూర్చి సరళమైన తాత్త్విక నిర్వచనం ఇవ్వగానే, అది విన్న ఆంగ్లేయుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. మిగిలిన వారంతా హాయిగా నవ్వుకున్నారు.

విశ్వకర్మ బహుముఖ ప్రజ్ఞాశాలి. సుందోప సుందులు అన్నదమ్ములయ్యీ ఒకరినొకరు కొట్టుకొని మరణించారు. వీరి చావుకు కారణమైన తిలోత్తమ విశ్వకర్మ సృష్టే. త్రిపురాసుర సంహారార్థం పరమ శివుడికి కావల్సిన దివ్యరథాన్ని విశ్వకర్మ రూపొందించి యిచ్చాడు. మొట్టమొదటగా విమానాలు కనిపెట్టిందీ విశ్వకర్మే! అవిరి శక్తితో స్థిరవేగంతో అంటే వాయువేగంలో పయనించే విమానం ఈయన సృష్టించిందే. పుష్పక విమానంలో ఎందరు కూర్చున్నా మరొకరికి చోటుంటుంది. రామరావణ యుద్ధం తర్వాత ఈ పుష్పకంలోనే శ్రీ రామచంద్రుడు సపరివారంగా అయోధ్యచేరాడు. ఖగోళ విజ్ఞానానికి ముఖ్యమైన దూరదర్శినిని మొట్టమొదటగా విశ్వకర్మ నిర్మించాడు. మనువు కోరిక మీద మహాశక్తి వంతమైన దూరదర్శినిని తయారు చేసియిచ్చాడు.

ఇంతే కాదు ఎందరికో వాస యోగ్యతను కల్పించిన వాడుకూడా విశ్వకర్మే! పరమశివుడు ఆజ్ఞాపించగా ఋషుల నివాసం కోసం ఎనిమిది యోజనాల విస్తీర్ణం గల సుందరమైన నగరాన్ని విశ్వకర్మ నిర్మించాడు. అదే విధంగా యాదవుల కోసం సముద్రమధ్యంలో ద్వారకను నిర్మించాడు. ఇంద్రుడి ముఖ్యపట్టణం అమరావతి ఆకాశంలో నిర్మింపబడ్డది. ఇదీ విశ్వకర్మ సృష్టే. దక్షిణ సముద్రమధ్యంలో దేవతల కోసం లంకానగరాన్ని నిర్మించి యిస్తే రావణుడు ఆక్రమించాడు.

ఆయుధాల తయారీలో కూడా విశ్వకర్మ తన నైపుణ్యాన్ని ప్రతిభావంతంగా ప్రదర్శించాడు. సూర్యుని భార్య సంజ్ఞాదేవి విశ్వకర్మ కుమార్తె. సూర్యుని తేజస్సును ఆమె భరించలేకపోతే తన పనిముట్లతో సూర్యుణ్ణి సానపట్టి అతని తేజస్సును తగ్గించాడు విశ్వకర్మ. ఈ తేజస్సుతో విష్ణుమూర్తి కోసమని సుదర్శన చక్రాన్ని తయారుచేసిచ్చాడు. భూత, భవిష్యత్ వర్తమాన కాలాలకు సూచికలయిన మూడు కొనలు గల శివుడి త్రిశూలాన్ని రూపొందించిందీ విశ్వకర్మే!

ఈయన శిష్యుడయిన మయుడు ధర్మరాజుకోసం ఒకగొప్ప సభా భవనాన్ని నిర్మించాడు. ఇది ఎంతటిదో భారత కథ తెల్సిన వారందరికీ అర్థమయ్యే విషయమే!

దేవతలందరికీ నామకరణం చేసింది విశ్వకర్మేనని ఋగ్వేదం చెబుతున్నది. వాస్తుశాస్త్రానికి సంబంధించిన ప్రామాణిక గ్రంథాన్ని విశ్వకర్మ రచించాడు.

విశ్వకర్మ హంస వాహనుడు. పంచముఖాలతో కూడా ఈయన చిత్రాలు కనబడుతుంటాయి. ఆయన చేతుల్లో అనేక ఆయుధాలు, ఉత్పత్తి సాధక పనిముట్లు వుంటాయి.

దేశంలోని కొన్ని ప్రాంతాల్లో మాఘశుద్ధ త్రయోదశి నాడు విశ్వకర్మ జయంతి జరుపుతారు. మరికొన్ని ప్రాంతాల్లో ముఖ్యంగా దేశపు తూర్పు భాగంలో భాద్రపద శుద్ధ పంచమినాడు జరుపుతారు. జాతీయ కార్మిక శక్తి ప్రతీక అయినటువంటి భారతీయ మజ్దూర్ సంఘ్ ఈ రెండవ తేదీని పాటిస్తున్నది.

ఈ వారసత్వాన్ని అంగీకరించలేని కొందరు కార్మిక నాయకులు ఈ సంప్రదాయ ఉత్సవాన్ని విస్మరించి ''మే'' దినోత్సవాన్ని కార్మికదినంగా జరుపుకొంటున్నారు. జాతి అనైక్యతకు ప్రతీక ఈ 'మే' దినం.

పాశ్చాత్య సమాజంలో పారిశ్రామిక విప్లవానంతరం వచ్చిన విచ్ఛిన్నకర భావాల ప్రతిరూపమే 'మే' దినోత్సవం.

ప్రపంచంలోని సంపదంతా సృష్టికర్తది. ప్రతి పురుషుడు, స్త్రీ ఆ సంపదను వృద్ధిచేసి తనకు కేటాయింపబడిన ప్రతి ఫలాన్ని బహుమానంగా స్వీకరించాలి. ఈ సమాజమంతా ఒక శరీరమైతే

స్త్రీ పురుషులంతా అందులోని భాగాలే. ఇదీ మన భారతీయ ఆలోచనా ధోరణి. గ్రామాల్లో వుండే వివిధ వృత్తులవారు ఎవరికీ సేవకులు కాదు. వారు ఎవరికీ వారే యజమానులు కాబట్టి సంఘర్షణకు యిక్కడ తావులేదు. జాతి సమైక్యతకు, జాతి ఆత్మగౌరవానికి సవాల్ అయిన 'మే' దినోత్సవాలను తిరస్కరించాలి. విశ్వకర్మ దినోత్సవమే నిజమైన కార్మికుల పండుగ.

ఈ సంగతిని విస్తృతంగా ప్రచారం చేయాలి. విశ్వకర్మ జయంతిని కార్మిక దినోత్సవంగా జరుపుకోవటంలోని విశాల దృక్పథాన్ని అందరికీ వివరించాలి.

దేశంలోని కార్మిక సంస్థలన్నీ విశ్వకర్మ జయంతిని జాతీయ కార్మిక దినోత్సవంగా జరుపుకోవల్సిన అవశ్యకతను స్పష్టంగా తెలియపర్చ వల్సిన బాధ్యత కార్మికులందరిమీద వుంది.

అప్పుడే విశ్వకర్మ జయంతి ఆదర్శ కార్మిక దినోత్సవంగా రూపొందగల్గుతుంది.

– శ్రీ చైతన్యమిత్ర.

---

# నిజదర్శనం

మూలం : విశ్వకవి

అనుసృతి : వాడవల్లి వెంకటరత్నం

ఏకాంతమందు
ఎవ్వనిసేవించి
ముక్తిని గాంచ
ముముక్షు వగుచు
ప్రార్థనా మందిర
ద్వారాంతరముల
అంధకారమం
దధివసించెదవు
ఏదోధ్యానమున
కనుదోయి మోడ్చి
ఎవని దర్శింప
నెంచెదవు నీవు
కనుదెరచి చూడ
సాక్షాత్కరింప
ప్రతిజీవకణములో
ప్రతిబింబించుచు
నీదు పొరుగున
నివసించుచున్న

తోటిమానవుల
పని పాటలందు
సహచరింపగా
భరితమై యున్న
భగవత్స్వరూప
మగు పించబోదె
అగు పించు చుండ
అర్చింప నింక
నిఖిల మానవ సేవా
నిరతుడ వవకే
సాటి మానవుడన్నచో
ఈసును జూపుచు
లోకాన్ని విడచి
బ్రతుకగ నెంచగా
ఏమోక్ష పథము
కరగతం బౌను
హృదయరహిత మౌ
ఉపాసనలోన !

# ధర్మస్మృతులు.

సమాజమునందవగాహనలేని, భాధ్యతాయుతమైన వారే మనుస్మృతి, పరాశర స్మృతుల గూర్చి మాట్లాడుట శోచనీయము. శ్లో॥ కృతేతు మానవాప్రోక్తాః। త్రేతాయా గౌతమాస్మృతాః ద్వాపరేశంఖ లిఖితా! కలేపారాశరీ స్మృతిః॥

సనాతన సంప్రదాయానుసారము కాలమానమున సృష్టి జరిగి 197, 29, 49, 096 సం॥లు గడచినవి. కాలగణనము: 4 యుగములు = 1 మహాయుగము: 71 మహాయుగములు = ఒక మన్వంతరము: 14 మన్వంతరములు + 15 మనుసంధులు = ఒక కల్పము. ఒక కలియుగమునకు 4,32,000 సంవత్సరములు. దానికి ద్విగుణము ద్వాపర, త్రిగుణము త్రేతా, చతుర్గుణము కృతయుగము. మన లెక్కలో ఒక కల్పము గడచిపోయినది అది బ్రహ్మకల్పము. ఇప్పుడు శ్వేత వరహా కల్పమున 6 మన్వంతరములు గడవగా, 7వ మన్వంతరమున వైవస్వతము – 27 మహాయుగములు గడవగా 28వ మహాయుగమునందు కృత, త్రేతా, ద్వాపర యుగములు గడువగా కలియుగము (శ్రీ కృష్ణుని నిర్వాణానంతరము) 5096 సంవత్సరములు గడచినవి. 71 మహాయుగములకు వర్తించు ధర్మమును స్వాయంభువ మనువు మనకు ప్రసాదించినది. ఈ మనువు ఎవరో మనుచరిత్ర చదువుడు. మఖలో పుట్టి పుబ్బలో చచ్చే వెర్రి వెంగళాయలు మనుధర్మశాస్త్రమును గూర్చి మాట్లాడిన ఏమనవలెను. 'లా' నేర్చిన శిక్ష తప్పించుకొనవచ్చు– వీనిని చదివిన నరకముతప్పును.

కాలక్రమేణ, మానవుడు దానవుడు కాకుండా, పతనతనిరోధించి మాధవునిగా మలచుటకు మనపెద్దలు, మహాతపస్వులు, మహాఋషులు ధర్మద్రష్టలు కల్ప కల్పమందునుద్భవించిరి. వారు: బోధాయనుడు కోవకు చేరినవి: బోధాయనము, ఆపస్తంబము, సత్యాషాఢము, ద్రాహి యాయణము, అగస్త్యము, శాండిల్యము, భారద్వాజము, అగ్నివైశ్యము, జైమినీయము, వాధూలము, మాధ్వందినము, శాండిన్యము, కౌసేతకములను, కల్ప సూత్రములందురు.

అటులనే త్రేతాయుగమున గౌతముడు, ద్వాపరమున శంఖలిఖితులు, కలియుగారంభమున పారాశరులు నుద్భవించి మానవాలినుద్ధరించుటకై ధర్మ ప్రబోధకమునకు మార్గదర్శకులైరి.

ఒక్క కలియుగమునందే యుధిష్ఠిర, విక్రమ, శాలివాహన, విజయనందన, నాగార్జున, కల్కిభూపతి అనబడే ఆర్గురు శక కర్తలున్నారు. అవికాక మనకు దిగుమతిగా క్రైస్తు, మహమ్మదులను కూడా తలచుచున్నాము. సూక్ష్మముగా చెప్పుటకు మనుస్మృతి యందున్న 2652 శ్లోకములు 12 అధ్యాయములుగా విభజించి వ్రాయబడినవి. వీటిని మనువు చెప్పగా భృగుమహర్షి మన కందించినవి. అందు జగదుత్పత్తి క్రమము, సంస్కారములు, వ్రతములు, పెద్దలు, గురువుల నభివాద పెట్టు సలపవలెను, పాంచభౌతిక దేహమును శుద్ధిచేయు కర్మలు, గృహస్థ, జీవన నియమములు, ఆహారవిధులు, శుచియశుచి, యతివాన ప్రస్త్రీ, సన్యాస ధర్మములు, రాజోచిత ధర్మములు, సాక్ష్యసంపన్నవిషయములు, లౌకిక వ్యవహార నిర్ణయములు, గృహస్థులకు సూచనలు, ప్రాయశ్చిత్త విధులు, కర్మలు, విధి నిషేధములు, మానవుని మనుగడకు కావలిసిన ధర్మములు నిక్షిప్తములై నాగరకతను పెంపొందించు విషయములనేకములు కలవు.

అటులనే పారాశర స్మృతియందు నిత్యనై మిత్తికములైన షట్కర్మలు, షోడశకర్మలు, శుచి, అశుచిలయందు విధి నిషేధములు, పితృదేవతారాధ నావశ్యకత శ్రాద్ధ విధులు, మరియు మానవుడు చేయు అనేక పాపములకు ప్రాయశ్చిత్తములు, శుద్ధిచేయు విధములు, చాతుర్వర్ణ్యమునకు జీవితమును ధర్మబద్ధ మొనరుచ్చుకొను అనేక విషయములను ప్రేమ, వాత్సల్యములతో శ్రేయస్సు కోరి గురువు శిష్యునకు, తాత మనుమనకు చెప్పిన పగిది చంటి పిల్లలకు గోరుముద్దల వలె ధర్మప్రబోధాత్మక గ్రంధములు మనయందు మానవతను నాగరికతను పెంపొందించు గ్రంధరాజములీ స్మృతులు. వీటి యందవి అమృతవాహిని గ్రోలని వాని జీవితము నిరర్ధకము.

**లోకాః సమస్తాః సుఖినోభవన్తు!**

# సహించినందుకు ప్రతిఫలం మోసం ద్రోహం

**మూలం:- శ్రీ ఆనంద శంకర పాండ్య.** **అనువాదం : - శ్రీ ఆర్కే గుప్త**

ప్రపంచంలోని మానవ కోటిని హిందువులు సోదర భావంతో ఆదరించడం లోకానికి తెలిసినదే. అన్ని మత ధర్మములను వారు సమానముగా గౌరవించెదరనుట ఉన్నమాటే. అహింసను అతిశ్రేష్ఠమైన ధర్మముగా వారు ఆచరించుట అందరూ ఎరిగినదే. ఐనను మన ప్రచార సాధనములు హిందువును ఉగ్రవాది, సర్వాధికారి అని అంటూనే వుండటం ఆశ్చర్యకరమైన విషయం. సుప్రసిద్ధ చరిత్ర కారుడు శ్రీ విల్ డ్యూరెంట్ వ్రాసిన విషయం గమనించండి. ''ఈ వేయి సంవత్సరముల కాలంలో శాంతి, సహన ప్రియమైన భారతావనికి రక్తతర్పణ ప్రసంగములే కలసివచ్చినవి. ఎందుకనగా ఆ సమయంమందే హిందూ సమాజముపైకి అసంఖ్యాక ఆక్రమణలు, దురాచారములు నడచినవి. మరి ఏ దేశము కూడా ఈ వేయి సం.. కాలములో ఇంతటి కష్టాలకు, కార్పణ్యాలకు గురికాలేదు'', విదేశీయుడైనా కూడా నిర్భయముగా అక్షరసత్యమును నిక్కచ్చిగా లోకానికి వెల్లడించినాడు.

స్వాతంత్ర్యము పొందిన పిదప కూడా హిందువులకు ఈ దుస్థితి తప్పలేదు. పాకిస్తాన్, ఆఫ్గనిస్తాన్, బంగ్లాదేశ్, ఫిజి, దక్షిణాఫ్రికా మున్నగు దేశములలో నివసించుచున్న హిందువులపై ఎక్కడలేని ఆక్రమణలు, మారణ హోమములు సాగుచునే వున్నవి. వారి ధార్మిక, ప్రజా తాంత్రిక స్వాతంత్ర్యాలను, మానవ హక్కులను కాలరాస్తున్నారు. ఆస్తిపాస్తుల లూటీలకు మహిళల మానమర్యాదలకు అంతమే లేకుండా పోతుంది. ఎక్కడ చూచినను వారు నిరాశ్రయులే. కొందరు హిందూ ధనవంతులు, రాజకీయ పలుకుబడి గలవారు తప్పితే మిగిలిన హిందూ సమాజం ఆటుపోట్లకు, హింసాజ్వాలలకు గురియై. అపాయమనే కొండ శిఖరంపై చివర నిస్సహాయంగా నిల్చివుంది. దేశ విభజన సమయంలో పాకిస్తాన్‌లో వున్న 1 1/4 కోట్ల మంది హిందువులైతే, నేడు అక్కడ బ్రతికి వున్నవారు కేవలం పదిలక్షల మంది మాత్రమే. మిగిలిన చాలా మంది అక్కడ భీకర హత్యలకు, లేదా అత్యాచారములకు గురియై నశించి వుందురని తెలియుచున్నది. బంగ్లాదేశ్‌లోను అదే పరిస్థితి వున్నది. మొదట అక్కడున్న 3 కోట్ల హిదువులతో నేడు జీవించి వున్నవారి సంఖ్య 1 కోటి మాత్రమే. కాశ్మీర్‌ను మాత్రం వదిలేయండి. అది భారత భూభాగమే అయినప్పటికి మతోన్మాదుల తాకిడికి అక్కడ హిందువులు అనేవారే కనబడక పోతున్నారు. అత్యధికులైన హిందువులను అల్ప సంఖ్యాకులుగా మార్చి నేటికి వారిని నామ మాత్రంగా మిగిల్చారని చెప్పనవసరంలేదు.

హిందువులపై యింతటి హేయమైన అత్యాచారములు నడచుచున్నప్పటికిని, దీనిని ఏ జాత్యతీత వాదులు కాని గాంధేయ వాదులు కాని అభ్యుదయ వాదులు కాని నిరోధించనూ లేదు. కనీసం ఖండించనూ లేదు. వెనకటికి భారత్‌లో 3 కోట్ల ముస్లిం సంతతి మాత్రమే వుండెడిది నేడు వారు వారి జనసంఖ్యను 11 కోట్లకు పెంచుకొన్నారు. భారతీయ సిద్ధాంతాలకు, జనాభా నియంత్రణకు వ్యతిరేకంగా జీవిస్తున్నారు. మానవత్వానికి అపచారం:- భారత దేశంలో హిందువుల జన సంఖ్య నేడు 70 కోట్ల అనగా ప్రపంచ జనాభలో ఏడింట ఒక భాగం. అయినా పాశ్చిమాత్య సంస్కృతికి దాసులైన మన జాత్యతీత వాదులు, ఇంతటి బ్రహ్మాండమైన హిందూ బంధుకోటి (ప్రజల) సమస్యలను మానవతాదృష్టితో చూడక జాతీయముగా పరిగణించుటవలన హిందుత్వానికే కాక మొత్తం మానవత్వానికే అపచారం జరిగినది. ఫ్రాన్ కోయిస్ అను ఫ్రెంచ్ రచయిత మాటలివి.'' శతాబ్దములనుండి ఆటుపోట్లను, దెబ్బలను తింటూ వచ్చిన హిందూ వంశస్థులై మిగిలిన నేటి హిందువులు మసీదు ఊహారూపమును ( ఏ రోజు నమాజు జరగని స్థలం) పోలిన ఓ కట్టడమును కూల్చినది నిజం. అది తప్పని చెప్పే స్వాతంత్ర్యం వుంది అన్నాకూడా వారిపై కడునిర్దయతో ప్రవర్తించారు. వారిని హింసా వాదులు అని దూషించారు. అయితే నిజం చెప్పాలంటే, వారెవరూ ఒక్కరిపై చేయెత్తలేదు. ఎందుకంటే హిందూ ధర్మం లోకంలోనే అత్యంత శాంతియుత మైనది. ముస్లిం మత ఛాందసులు బాంబులు వేసి, బొంబాయిలో 350 మందిని బలిగొన్నారు. చచ్చిన వారు హిందువులే అనే సత్యాన్ని ఏ నాయకుడే కాని ఏ బుద్ధిమంతుడే కాని,

నోరువిప్పి చెప్పలేదు. ఈ పై వార్త 10-4-93న బ్లిడ్జ్ వారపత్రికలో ప్రచురించబడినది '' ఈ సందర్భంలో నాగరికత మట్టం పెరిగి పోయినట్టు ఏదైనా అసభ్యవర్గం జరిగిన మారణహోమమును మింగి వేస్తుంది'' అని ఆర్ నాల్డ్ టైన్ బీ మాటలు మనకు స్మరణకు వచ్చుట సహజము. అన్యాయము యొక్క పరాకాష్ట.- తాము అత్యంత పవిత్రమని భావిస్తున్న రామజన్మ భూమి తమకే చెందాలని హిందువులు ఆగ్రహించిన వేళ, వారికి దొరికినది తుపాకీ గుండ్లు మాత్రమే. వాటికి తోడు హిందువుల మత మార్పిడిలు, వారు పవిత్రమని భావించేగో హత్యలు పెట్రేగిపోయాయి. అదే జాత్యతీత దేశాలైన బ్రిటన్, ఫ్రాన్సులను చూడండి అక్కడ బహుసంఖ్యాకుల మత ధర్మమే దేశమత ధర్మంగా చెలామణి అగుచున్నది. మన దేశంలో భగవద్గీత, రామాయణాదులను పాఠశాలలో బోధించుటకు కూడా అడ్డంకులు, అవరోధములే. అదే ఖురాన్, బైబిల్ నేర్పుటకు సర్వ స్వతంత్ర్యమున్నది. రానురాను హిందువులు తమ మూల సంస్కృతినే మరచిపోతున్నారు. మనకన్నా చిన్న దేశమైన ప్రక్కనే వున్న నేపాల్ మొన్ననే తమ దేశమును ప్రపంచంలో మొట్టమొదటి హిందూదేశముగా ప్రకటించుకొన్నది. అదే మనం హిందూ దేశమనే పూర్వీకులుంచిన ప్రాచీన నామమును వదలి బారత దేశమనే పేరునే స్థిరపరచుకొన్నాం. అఖండము, సుసంపన్నము ఐన మన ప్రాచీన సంస్కృతిని మరచిపోతున్నామని చెప్పుటకు యింతకన్నా ఉదాహరణ అవసరము లేదనుకొంటా. బంగ్లాదేశ్ నుండి పారి వచ్చిన 1 1/2 కోట్ల మంది ముస్లిం శరణార్థులకు నివాసము లేర్పరచి; తమ స్వార్థం కోసము వారి ఓటు బ్యాంకులను పదిలంచేసికొన్న దుర్మార్గ రాజకీయ వర్గాలు కూడా నేడు మన మధ్యన వున్నాయి. ఆ ముస్లిం రాబంధులు భారతీయుల చేతి ముద్దను సయితం కబళించుటకు వెనుకాడుట లేదంటే అది ఆశ్చర్యకర విషయం కాదు. బహు సంఖ్యాకులైన హిందువులకు ఇపుడే ఇంతటి కష్టనష్టాలు కలుగుతుంటే మునుముందు దేశంలో ఇంకెంతటి విపత్కర పరిస్థితులొస్తాయో అని ఆలోచించవలసి వుంటుంది. స్వాతంత్ర్యానంతరం తమదే అయిన దేశంలో స్వతంత్రంగా బ్రతకవచ్చునని హైందవ కోటి భావించింది. వేల సం..ల నుండి నాశనమవుతూ వచ్చిన తమ జీవన సూత్రమును, సంస్కృతిని, జీవన పద్ధతులను పెంచుకొని, ఉన్నతి సాధించవచ్చుననే హిందువుల గొప్ప ఆశ నేడు కలగా మారింది. తమదేశ సంస్కృతి, ధర్మములను సదా కాపాడుకోవలెనని ప్రపంచ దేశముల నాయకులు నేడు శ్రమించుచున్నారు. ఈ దేశంలో మాత్రం అందుకు భిన్నంగా వున్నది. బీద హిందువులకు ఆర్థిక సహాయమునకై ధర్మనిధిని స్థాపించడం కూడా సాధ్యం కావటంలేదు. కారణం అందుకు విరాళపు పన్ను మినహాయింపు కూడా యిచ్చుట లేదు.

**హిందువుల పరమత సహనం:-** భారత దేశమునకు వలసవచ్చిన యితర మతస్థుల కార్యక్రమములకు కూడా ఆనాడు యిక్కడ ఆశ్రయం లభించు చుండెడిది. పరమత సహనమునకు ప్రతీకగా హైందవ రాజు లానాడు మసీదు, చర్చిలను కట్టించు చుండెడివారు. అయితే అదే జనుల వంశస్థులు నేడు హిందూ సమాజమునకు ద్రోహం, హాని తలపెట్టుచున్నారు. గడచిన కొన్ని సం..లలో ఇక్కడ వేలకొలది హిందూ దేవాలయములు నేలమట్టములైనవి. ఉదార స్వభావులైన హిందువులు దేశాధ్యక్ష, గవర్నర్, ముఖ్యమంత్రి లాంటి ముఖ్యఅధికారాలే కాక తమకు లేని కొన్ని విశేషమైన హక్కులను ముస్లింలకు విడిచి పెట్టినారు. వేరే మతస్థుల, మతవిషయములలో కాని పూజామందిరాల ధ్వంసం లేదా నష్టం కల్గించుటలో కాని ఏనాడు ఏ హిందువు కూడా చేయి పెట్టలేదు. ఎందుకనగా అవన్ని హిందుతత్వమునకు విరుద్ధమైన పనులు. అలాంటి హేయమైన ప్రవర్తన, దుర్గుణములు వారి రక్తంలోనే లేవు. ''ప్రపంచం లోనే ఏకైక పరమత సహనం గలది హిందూమత మొక్కటే'' అని ఇస్లాం తాత్వికుడు వహీరుద్దీన్ ఖాన్ లాంటి పెద్ద లెందరో తెల్పినారు. కాంట్‌వెల్ స్మిత్ అను పాశ్చాత్య విద్వాంసుడు. ''భారతదేశంలోని ముసల్మానులు అంతులేని స్వేచ్ఛా స్వాతంత్ర్యములను అనుభవించుచున్నారు. అది ఎంతటిదనగా (ఇస్లాం) అరబ్ దేశములలో నివసించు, ముస్లిమ్‌లకే ఆదేశములు అంతటి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను కల్పించడం లేదు.'' ఇంతటి సద్భావనలకు ప్రతిక్రియగా ముస్లింలు కృతజ్ఞతలు చూపడంలేదని హిందువులు భావించడము కద్దు. అయితే హిందువులు సహించుకొని పోయినందుకు ఇంతవరకు దొరికిన ప్రతిఫలము కేవలం మోసము, ద్రోహము మాత్రమే. (సశేషం)

# విదేశాల్లో శ్రీ అశోక్ జీ

(విశ్వహిందూపరిషత్ కార్యాధ్యక్షులు మాననీయ శ్రీ అశోక్ సింఘాల్ గారు అరేబియన్ దేశాల పర్యటన నుండి తిరిగి వచ్చిన తరువాత విడుదల చేసిన పత్రికా ప్రకటన :-)

న్యూఢిల్లీ 2 జూలై 1996 : భారతదేశము తమ నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరుపుతున్న శక్తి వంతమైన స్వాతంత్ర్య పోరాటం ఆగదనీ, స్వతంత్ర సిద్ధి కోసం తమ జీవితాలను త్యాగం చేసేందుకు సిద్ధపడిన అనేకమంది యువకులు ముందుకు వస్తున్నారనీ గ్రహించిన బ్రిటీష్‌వారు స్వాతంత్ర్య సమరయోధులను రాజకీయ నేరస్థులుగా చిత్రించి ద్వీపాంతర వాస శిక్షలను విధించి విదేశాలకు తరలించటానికి పాల్పడ్డారు. ఈ భారతీయులకు బలవంతముగా వివిధదేశాలకు ఓడలు, స్టీమర్ల ద్వారా 150 సంవత్సరాల క్రితము తరలించ బడ్డారు. భారతీయులు, ట్రినిడాడ్, గయానా, సురినామ్, అనే పశ్చిమ ఇండియా దీవులకు (వెస్టిండీస్) అనినేడు పిలవబడుతున్న దేశాలకు దిగుమతి చేసుకున్న శ్రామికులుగా చేరుకున్నారు. వీరిలో అత్యధికులు తూర్పు ఉత్తర ప్రదేశ్, బీహార్, రాష్ట్రాల గ్రామాలనుండి తరలించబడ్డారు. వీరంతా నాలుగు నెలల సుదీర్ఘ ఓడ ప్రయాణములో నానా అవస్థలు పడవల్సివచ్చింది. వీరిలో దాదాపు 20 శాతం మంది ఈ ప్రయాణంలో మరణించారు. భారత స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచటానికి ఈ దారుణమైన తరలింపులను ఆఖరి ఆయుధముగా బ్రిటిష్ వారు ఉపయోగించారు.

బ్రిటీష్ వారు సాగించిన ఈ దారుణ అత్యాచారాలు, దోపిడీలు ప్రపంచ చరిత్రలో కారునలుపు అధ్యాయాలు. బ్రిటీష్ దేశాన్ని ప్రపంచములో ధనవంతమైన దేశముగాను, అభివృద్ధి చెందిన దేశముగా మార్చినది, బంగారు చిలుకగా పేరుగాంచిన భారతదేశాన్ని నిరుపేదదేశముగా మార్చినది ఈ దోపిడీయే. ద్వీపాంతరవాస శిక్షను అమలు చేయుటానికి భారతీయులను పసిఫిక్ మహాసముద్రంలోని మారిషస్ దీవులకు దక్షిణాఫ్రికాకు పంపించారు.

నేను ట్రినిడాడ్, గయానా, సురినామ్ ఈ మూడుదేశాలు సందర్శించాను. ట్రినిడాడ్‌లో పోర్టుస్పెయిన్, గయానాలో జార్జిటౌన్, సురినామ్‌లోని నికరీ, పారామారిగో, అనేపట్టణాలకు వెళ్ళాను, ఈ మూడు దేశాలలోను నేటికీ రైలు బండి సౌకర్యములేదు. కారు, బస్సు, స్టీమరు, విమానము, ప్రయాణానికి ఉపయోగించుకుంటారు. హిందువులు ట్రినిడాడ్ చేరి 150సంవత్సరాలు అయిన సందర్భముగా, సురినామ్‌కుచేరి 120సంవత్సరాలు అయిన సందర్భముగా జరుగుతున్న ఉత్సవాలలో పాల్గొనటానికి నేను ఈ దేశాల పర్యటనకు వచ్చాను. ట్రినిడాడ్ ప్రస్తుత ప్రధాన మంత్రి పేరు శ్రీవాసుదేవ పాండే, గయానా ప్రధాన మంత్రి శ్రీ ఛేధిజగన్, సురినామ్‌లో ఎన్నికలు జరిగి 1 1/2 నెల అయినది. ఇంకా అక్కడ కొత్త ప్రభుత్వం ఏర్పడలేదు. ఎన్నికైన ప్రజాప్రతినిధులు శ్రీలక్ష్మణ జగన్నాథ్‌ను ప్రధానిగా ఎన్నుకుంటారని భావిస్తున్నారు. ఈ దేశాలలోని హిందూ సమాజము రాజకీయాలను ప్రభావితము చేయటం మాత్రమేకాక ఆయాదేశాల వ్యవసాయ వికాసానికి, సామాజిక, ఆర్థిక రంగాల వికాసానికి కూడ గణనీయమైన రీతిలో కృషి చేసింది.

భారతదేశంతో వీరికి ఆర్థికపరమైన సంబంధాలు దాదాపుగా లేవు. ఈ దిగుమతి చేయబడిన శ్రామికులకు సంబంధించిన ముఖ్య విశేషమేమంటే నాటి నుండి నేటి వరకు తమ ధార్మిక, సాంస్కృతిక, సాంప్రదాయక విలువలను ఏ మాత్రము చెక్కు చెదరకుండా కాపాడు కుంటూ వచ్చారు. తమతమ సంతతి నేటికీ యథాతథ ంగా ఆచరిస్తు ఉన్నారుకూడా. ఈ దేశాల జనాభాలో 50 శాతము మంది భారతీయ సంతతికి చెందిన వారు కాగా, మిగిలినవారు ఐరోపా, ఆఫ్రికా, సంతతికి చెందినవారు. వీరంతా దాదాపుగా క్రైస్తవులు. క్రైస్తవులుగా మతము మార్పుటానికి హిందువులపై గట్టి ప్రయత్నం చేశారు. వీటిని తట్టుకొని హిందువులుగా నిలవటం చాలకష్టం కూడా. ఈ 150 సంవత్సరాలలో దాదాపు 20 శాతం మంది క్రైస్తవులుగా మారిపోయారు. నియంతృత్వ పరిపాలన ఏర్పడిన సమయములో హిందువులు ఆదేశాలను వదిలి వలస వెళ్ళవల్సి వచ్చింది. సుమారు లక్షమంది హిందువులు సురినామ్ నుండి హాలెండుకు వలస వెళ్ళారు. ఇంత కంటే అధిక సంఖ్యలో హిందువులు గయానా నుండి ఉత్తర అమెరికాకు వలస వెళ్ళారు. ఈ మూడు దేశాలకు అపారమైన పెట్రోలు, ఖనిజాలు నిల్వలు ఉన్నాయి. భారతదేశము ఈ దేశాల అభివృద్ధికి ఎంతో సహకారాన్ని అందించవచ్చు. విశ్వహిందూ పరిషత్ ద్వారా ఇక్కడి హిందూ సమాజాన్ని జాగృతము చేసే కృషి జరుగుతున్నది. విశేషించి గత 10 సంవత్సరాలుగా రామాయణంపై హిందువులకు వున్న భక్తిని ఆధారము చేసుకొని రామకథా కార్యక్రమాలను ధర్మాచార్యుల చేత నిర్వహింపచేయటం జరిగింది. అక్కడవున్న వందలాది దేవాలయాలు వారు హిందూ ధర్మాన్ని అంటి పెట్టుకొని ఉండటానికి దోహద పడుతున్నాయి. వివిధ ప్రదేశాలకు ధర్మాచార్యుల పర్యటనలు జరపటం కూడ హిందూ జాగరణకు ఉపకరిస్తుంది. పురాణాలు ఆధారంగా ట్రినిడాడ్‌లో 1996 జూన్ 2వ తేదీన గంగా దసరా అనే పేరుతో (జాతర) ఒక తీర్థాన్ని ప్రారంభించుకున్నారు. పర్వతాలనుండి ప్రవహించే రెండు నదుల సంగమ ప్రదేశంలో ట్రినిడాడీశ్వర్'' పేరుతో ఒక విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. భారతదేశములోని 2000 ప్రదేశాలనుండి తెచ్చిన పవిత్ర జలాలను, పవిత్ర మృత్తికను, విగ్రహా ప్రతిష్టకు ఉపయోగించారు. ఈ ప్రదేశానికి ''కపిల ప్రయాగ'' అని పేరు పెట్టుకున్నారు. వేలాది మంది మహిళలు, పురుషులు ''గంగా దసరా'' జాతరలో పాల్గొన్నారు. ఈ సందర్భముగా చిన్న పిల్లలు తలనీలాలు సమర్పించుకున్నారు. నూతన వధూవరులకు స్వామి శ్రీ బ్రహ్మదేవ్‌జీ ఆశీస్సులు అందించారు. ఈ విగ్రహ ప్రతిష్ఠకుముందు ఈ తలనీలాలు చర్చిలో సమర్పించేవారు. నేటికి ఇక్కడ హిందూ సమాజములో హిందూజాగరణ, హిందుత్వ స్వాభిమానము, హిందూ అస్థిత్వంపట్ల తీవ్రమైన భావావేశము కనిపిస్తుంది. వివిధ హిందూ సంస్థలన్నింటినీ ఒకవేదికపైకి తెచ్చి ఒక ప్రచండ హిందూ శక్తి నిర్మాణం చేసే కృషి జరుగుతుంది.

25సంవత్సరాల క్రితము ఈ మూడు దేశాలలోను తమ మొదటి యాత్రలో సందర్శించిన విశ్వహిందూ పరిషత్ మొట్టమొదటి ప్రధాన కార్యదర్శి స్వర్గీయ దాదాసాహెబ్ ఆప్టేజీ ఈ దిశలో ప్రయత్నాలకు శ్రీకారము చుట్టారు. వారి కృషి నేటికి స్థిరంగా హిందూ సంఘటనకు సహకరిస్తూనే వుంది.

అనువాదం:- శ్రీ కె.కె. శర్మ.

ఇతిహాసాలు

# రామాయణంలో వైజ్ఞానిక విశేషాలు

-కె.బి. సోమయాజులు.

**శ్లో॥ వేదవేద్యే పరేత్పుంసి జాతే దశరధాత్మజే**
**వేదఃప్రా చేతసాదాసీత్సాక్షాద్రా మాయణాత్మనా**

రామాయణంలో వైజ్ఞానిక విశేషాలను గురించి స్థాలీపులాకంగా ముచ్చటించుకునే ముందు శ్రీ రాముడు వేద వేద్యుడని, రామాయణ కర్తయైన వాల్మీకి వేద తత్త్వజ్ఞుడని, వేదార్థమును తెలిపేదే రామాయణమని చాటి చెబుతున్న పై శ్లోకభావాన్ని మనసు నందుంచుకుందాము.

వేదములు పూర్వాపరవిద్యలకు - అంటే ఐహికాముష్మిక విద్యలు రెంటికీ నిధానములు. రామాయణము సకల శాస్త్రాలసారాన్ని సూత్రప్రాయంగా అందించే మహత్తర రచనయని విజ్ఞుల నిర్ణయము.

రామాయణంలో ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలకు కూడా ఆశ్చర్యాన్ని కలిగించే అనేక వైజ్ఞానిక రహస్యాలున్నాయి. అవి సంకేతాలుగా ఉన్నాయి. వాటిని విడమరచి చూడవలసిన అవసరముంది. అంతగుంభనగా చెప్పడ మెందుకు? అంటే నేడు విజ్ఞాన శాస్త్ర వేత్తలు తాము కనుగొన్న సిద్ధాంతములను ఆయాసూత్రముల ద్వారా - ఈక్వేషన్స్‌లో తెలుపుతున్నట్లే ఋషులు తాము కనుగొన్న ప్రకృతి రహస్యాలను సంకేతముల ద్వారా తెలుపుట ఆచారము.

నిజానికి రామాయణంలో వైజ్ఞానిక విశేషాలంటూ ఏమీలేక పోయినా ఉన్నాయని మనమూహించుకుంటున్నామేమో! లేక వాల్మీకి కవిగా ఊహాకల్పన చేశారేమో! అన్న అనుమానం కలిగితే అందుకు యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో

''నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః'' అని సమాధానం చెప్పారు. అంటే ''లేనిది ఊహలోనికి రాదని, ఊహలోనికి వచ్చిందంటే ఉంది కావుననే వచ్చిందని'' అర్థం.

అసలు వ్యాస, వశిష్ఠ, విశ్వామిత్ర, నారద, భరద్వాజ, అత్రి, అంగిరస, అగస్త్యాది మహర్షులందరూ ఎంతటి అధ్యాత్మ విద్యా సంపన్నులో అంతటి సైంటిస్టులుకూడాననడంలో సందేహంలేదు. మహారణ్యాలలోని వారి ఆశ్రమాలన్నీ విజ్ఞాన రహస్యాలను వెలికితీయడానికి పరిశోధనలు చేసే ప్రయోగశాలలే? అక్కడ జరిగే యజ్ఞయాగాదులన్నీ విజ్ఞాన శాస్త్ర ప్రయోగాలే? అందుకే తమ ప్రాతినిధ్యానికి దెబ్బ తగులుతుందని. తమ మూఢనమ్మకాలు కొనసాగవన్న భయంతోనే రావణాది రాక్షసులు ఋష్యాశ్రమాలను తగుల బెట్టడము. యజ్ఞయాగాదులను విధ్వంసం చేయడము, ఋషి మహర్షులను సంహరించడమూ చేసేవారు. ఆధునిక కాలంలో కూడా ఎంత మంది సైంటిస్టులు ఆ విధంగా నిరంకుశ పాలకుల చేత, మత ఛాందసుల చేత సంహరింపడబలేదు? ఐతే ఆధునికవైజ్ఞానిక పితా మహుడైన ఐన్‌స్టీన్ పండితుడు, Science without religion is lame, religion without science is blind " అన్నమాటకు భారతీయ ఋషుల ఆలోచనా విధానమే స్ఫూర్తిదాత.

రామాయణంలో రాజ్య పరిపాలన, పరిరక్షణ, అర్ధనీతి, దండనీతి, మంత్రాంగము మొదలైనవి సమస్త విశ్వానికీ మార్గదర్శకాలు. రామరాజ్యంలో చారులు-అంటే సి. ఐ.డి.లు ప్రజల తప్పులు పట్టుకోవడానికి గాక రాజు తప్పులు పట్టుకొనుటకు ఉండేవారు.

రామాయణంలో నగరయోజన - Town Planning కు సంబంధించిన విజ్ఞానమెంత పరిపూర్ణమో అయోధ్య, లంకా నగర వర్ణనలను చదివితే తెలుస్తుంది. రామాయణంలోని భూగోళ, ఖగోళ విజ్ఞానములు నేటికీ మన కాశ్చర్యాన్ని కలిగిస్తాయి. ముఖ్యంగా కిష్కింధకాండలో సీతను వెదుకుటకు వానరులను నాలుగు దిక్కులకూ పంపిస్తూ సుగ్రీవాదులు తెలిపిన భూగోళ విశేషాలు అమోఘములు. రామాయణంలోని ప్రజల జీవన పద్ధతి, ఆహారవిహారాలు. వేష భూషలు, ఇండ్లు వాటి అలంకరణ, నేటి నవనాగరిక సమాజానికి కూడా పాఠాలు చెప్పగలవు.

అయోధ్యకాండలో భరతునికి భరద్వాజుడు చేసిన అతిథి మర్యాదలు అపూర్వములు. స్నానపానాదులకు చేసిన ఏర్పాట్లు. దంతధావనకు కల్కములు - Pastes, కుంచెలు - Brushes, ముఖానికి Face Powders, దువ్వెనలు, మీసములు దిద్దుకొనుటకు సాధనాలు మొదలగు వాటి వర్ణనలు ఆశ్చర్యమును కలిగిస్తాయి.

రామాయణంలోని యుద్ధతంత్రము. అస్త్ర శస్త్రాదులు గమనిస్తే విస్మయం కలుగుతుంది. విశ్వామిత్రుడు రామునికి ప్రసాదించిన బల, అతి బల విద్యలు రెండు ఓషధులని వెతికితే యీనాడూ లభిస్తాయని పెద్దలంటున్నారు. ఈ విషయంలో పరిశోధన సాగాలి.

విశ్వామిత్రుడు రామునికి అనేక అస్త్ర శస్త్రాలను ప్రసాదించారు. సామాన్యంగా యీనాడు మనముపయోగించే మిసైల్స్, బాంబులు, తూటాలు శత్రువుకు తగిలితే ప్రాణాలు తీస్తాయి, లేదా గురి తప్పితే వ్యర్థమౌతాయి. కానీ విశ్వామిత్రుడు ఇచ్చినవి -

**శ్లో. దర్పణం, శోషణం చైవ సన్తాపన విలాపనే ॥ -**
**మదనంచైవ దుర్ధర్షం కందర్పదయితం తథా ॥**

దర్పణాస్త్రమంటే శత్రువుకు గర్వం తెప్పించే అస్త్రం. ఆగర్వంతో విర్రవీగి యుద్ధం చేయక ఓడిపోతాడు. శోషణాస్త్రం శత్రువును ఎండిపోయేటట్లుచేస్తుంది. సంతాపనాస్త్రం తపింపజేస్తుంది. విలాపనాస్త్రం ప్రయోగిస్తే శత్రువు ఏడుస్తూ ఉండిపోతాడు. మదనాస్త్ర ప్రభావంతో శత్రువు కామపీడితుడౌతాడు. మోహనాస్త్రం మూర్ఛితుడిని చేస్తుంది.

శ్రీరాముడు, మారీచ సుబాహులతో యుద్ధం చేస్తూ సుబాహుని సంహరించాడు. మారీచుని చంపకుండా "శీతేషువు"-అంటే చల్లని బాణంతో కొట్టాడు. దాని దెబ్బకు మారీచుడు చైతన్య రహితుడై గిఱ్ఱున తిరిగి పారిపోతాడు. వానిని చూపిస్తూ రాముడు లక్ష్మణునితో,

**శ్లో. పశ్యలక్ష్మణ శీతేషుం మానవం ధ ॥ సంహితమ్,**

**మోహయిత్వా నయత్యేనం నచ ప్రాణైర్వ్య యుజ్యత** అంటాడు. అంటే "యీ శీతేషువీనికి

మోహమును కలిగించితీసుకొని పోవుచున్నది గానీ ప్రాణాలు తీయలేదు చూడు.'' అని చూపిస్తాడు.

నేడు మనం కేవలం బాష్పవాయుగోళాలనో, ప్లాస్టిక్ బుల్లెట్లనో వాడగలుగుతున్నాముగానీ పైనుదాహరించిన స్థాయికి యింకా ఎదగవలసి యున్నది.

శ్రీరాముని సేనకోతులు, కొండముచ్చులని, వాళ్లు కేవలం రాళ్లు రప్పలతో రావణసైన్యంతో యుద్ధం చేశారని భావించడం సమంజసం కాదు. ఇండొనేషియన్ రామాయణంలో రామునిసైన్యం సాయుధులైన సైనికులతో కూడిన ఏడు డివిజన్లుండేదని,వాటికి శ్రీరామ, లక్ష్మణాదులైన ఏడుగురు నాయకత్వం వహించారని పేర్కొన బడింది. జైనరామాయణం రాక్షసులు, వానరులు కూడా మానవులేనని, వారికి సైన్సు, వ్యోమయానాది విద్యలు క్షుణ్ణంగా తెలుసునని అందువలన వారికి విద్యాధరులని పేరని, వారు ఆకాశంలో విమానాల మీద సంచరించగలరు కావున ఖేచరులన్న పేరువచ్చినదని వర్ణించింది. వారి జండా మీద గుర్తు వానరముగావున వారికి వానరులన్న పేరు వచ్చినదని, అట్లే రావణుని ధ్వజముపై వీణ గుర్తుగా నుండుటవలన అతడు వీణాంకిత ధ్వజుడని తెలుపబడింది.

వానరసైన్యంలో నీలుడు వంతెనలు నిర్మించే యింజనీరు లంకకు వారధి కట్టిన దాతడే. జాంబవంతుడు, సుషేణులు వైద్యులు. శ్రీరాముడు యుద్ధ సమయంలో అయోధ్యతో వార్తా సంబంధములు పెట్టుకున్నట్లు రామాయణం చెబుతోంది.

రాక్షస సైనికులకు చెవులకు తగిలించుకునే ఇయర్ ఫోన్ లుండేవి. వాటిద్వారా కేంద్రము యొక్క అదేశాలు అందుకునేవారు. రాక్షససైనికులు చేతికి దొరికి నప్పుడు శ్రీరాముడు వారి చెవులు కోయించడంలో ఆంతర్యమిదే. ఈ విధమైన శిక్ష మొట్టమొదట' శూర్పనఖకు విధింపబడింది. ఈ ఇయర్‌ఫోన్‌ల వ్యవస్థనేర్పాటు చేసినవాడు కుంభకర్ణుడు – అంటే కుండలవంటి చెవులు కలవాడు.

రావణుని సైన్యం కూడా యుద్ధాలలో ఆరితేరినది. అతని వాయుసేనకూడా గట్టిది. రావణుడు లంకానగరాన్ని సౌర శక్తి – Solar Energy–తో కాపాడేవాడు. అందువలననే రావణునితో యుద్ధం చేసే ముందు శ్రీరాముడు అగస్త్యమహర్షి ఆదేశంతో ఆధిత్యహృదయస్తోత్రం పఠించి సూర్యశక్తిని స్వాధీనం చేసుకోగలిగాడు..

శ్రీరాముడు గెరిల్లా యుద్ధతంత్రమునుపయోగించి రావణునితో యుద్ధం చేసినట్లు స్పష్టంగా కనబడుతోంది.

ధనుర్వేద మొక ఉపవేదము. దానిలో 108 భాగాలున్నాయి. ఇందులో అస్త్రములను తయారుచేసే విధానం వివరింపబడింది. రామాయణ కాలంలో అనేక యుద్ధపద్ధతులున్నవని తెలుస్తోంది, వాటిలో మంత్రశక్తితో అస్త్రములను ప్రయోగించే పద్ధతియొకటి. అస్త్రములంటే నేటి మిసైల్సే. ఈ నాడు వాటినేవిధంగా రిమోట్ కంట్రోలు ద్వారా నియంత్రణం చేస్తున్నామో అదేవిధంగా మంత్రము – అంటే శబ్దము ద్వారా నియంత్రితం చేసేవారు.

కాని అయస్కాంత తరంగాలతో, కొన్ని విద్యుత్తు లేక సౌర శక్తితో నియంత్రితములయేవీ ఉపయోగింపబడేవి. కొన్ని వాయువుకన్న, మరికొన్ని శబ్దంకన్న, కొన్ని కాంతికన్నను వేగంగా పోగలిగేవి ప్రయోగింపబడ్డాయి.

'బాణము' అని పేరున్న రాకెట్ భూమ్యాకర్షణ శక్తి కక్ష్యనుదాటి పయనించగలిగేది.

రామాయణమనగానే పుష్పక విమానం గుర్తుకు రాక తప్పదు. విమానములు, వాటి నిర్మాణ, ఉపయోగాలు ప్రపంచమునకు తెలిపిన వారు భారతీయ ఋషి మహర్షులన్న మాట కేవలము ఊహకాదనుటకు ప్రముఖ నిదర్శనము భరద్వాజ మహర్షి కృత యంత్ర సర్వస్వమన్న గ్రంథము. అసలీ విమాన శాస్త్రము తెలిసినవారు భరద్వాజుని కన్న ముందే యున్నట్లు భరద్వాజుడే పేర్కొన్నారు. వారు

**శ్లో. నారాయణ శ్శౌనకశ్చ గర్గో వాచస్పతిసథా**
**చాక్రాయణ ర్ఘుండినాథశ్చేతి శాస్త్రకృత స్స్వయం**
**అనువారు. అట్లే వారు రచించిన గ్రంథాలు-**
**శ్లో. విమాన చంద్రి కావ్యోమయాన తంత్రస్తథైవచ**
**యంత్ర కల్పోయాన బిందుః ఖేటయాన ప్రదీపికా**
**వ్యోమయానార్క ప్రకాశశ్చేతి శాస్త్రాణి షట్ క్రమాత్**
**నారాయణాది మునిభిః ప్రోక్తాని జ్ఞాన విత్తమైః**

అని తెలుపబడింది. ఈ గ్రంథంలో వివిధరీతుల విమానాలు పేర్కొనబడ్డాయి. వాటిలో పుష్పకమొకటి. ఇది నేటి 'జంబోజెట్' వంటిది.

సుందరకాండలో హనుమంతుడు చూపిన యోగ విభూతులు నేటి సైన్సుకు అందని సంఘటనలు, ఐతే నిత్యం పరిపూర్ణత వైపుకు పరుగులు తీసే నేటి విజ్ఞాన శాస్త్రం వాటిని పరిశోధించగలిగితే అనేక అపూర్వ విషయాలు ఆవిష్కరింపబడతాయనడంలో సందేహంలేదు.

ఆంజనేయుడు శతయోజన విస్తీర్ణమైన సముద్రాన్ని దాటేటపుడు అనేక అడ్డంకుల నెదుర్కొంటాడు. వాటిలో సింహిక హనుమంతుని నీడను పట్టుకుని క్రిందికి లాగుతుంది. నీడ పదర్థామా ? కాకుంటే ఎట్లా లాగింది? ఇటువంటి అనేక విషయాలను తరచి చూడవలసిన అవసరమున్నది. అప్పుడు వేద, శాస్త్ర పురాణేతి హాసాలు కేవలము సైన్సులే కావని, అవి Super Science అనీ నిరూపణమౌతుంది. శుభం భూయత్ !

(AIR కర్నూలు సౌజన్యంతో) — (శ్రీ) కె.బి. సోమయాజులు.

---

**లేఖ** ★ 'విశ్వహిందు' ప్రధాన సంపాదకులు, శ్రీ రామరాజుగారు 'శ్రీ మాధవ విద్యారణ్య స్వామి'ని గూర్చిన వ్యాసం, 166పుటల గ్రంథమును కేవలం 6 పుటల్లో గ్రంథంలోని ఒక్క విషయమూ వదలకుండా వ్రాయడం ఆశ్చర్యం.

'విశ్వహిందు' పత్రికలోని ఇతర వ్యాసములు కూడ దేశాభిమానులకు ఉత్తేజము కలిగించునట్టివి. ఈ పత్రిక కలకాలము తన కర్తవ్యమును నిర్వహించుచుండుగాక అని కాంక్షించుచున్నాను.

అలంపూరు. 4.8.96. ఇట్లు / గడియారం రామకృష్ణశర్మ

## (మనదృక్కోణం) భారత్‌లో ఇస్లాం హైందవమైంది

సాంస్కృతిక విలీనం ఆ వర్గంవారి మేధావులతోనే గదా ప్రారంభం అయ్యేది! ఏ దేశంలోనైనా సాంస్కృతికంగా హీన దశలోవున్న పాలకులు ఉన్నతమైన సంస్కృతికి లొంగిపోతారు. అల్బెరూనీ కాలం నుంచీ హిందుత్వం ముస్లిం మేధావులపైన ప్రభావం చూపుతూనే వుంది. ముస్లింల ప్రయోజనం కోసం అబుల్ ఫజల్ షడ్దర్శనాలను అనువదించాడు. అక్బరు పాలనలో ముస్లింలు సంస్కృత భాషపట్ల హిందూ మతాలపట్ల ఎంతో శ్రద్ధ చూపారు. ఆ రోజుల్లో మహాభారతం, రామాయణం, అధర్వవేదం ముస్లింలకు అందుబాటులో వుండేవి. కేవలం ఇస్లాంతోనే హిందువుల్ని వైజ్ఞానికంగా లోబర్చుకోలేమని గ్రహించాడు అక్బరు. అందువల్లనే కొత్త దేవమతం అని 'దీన్ – ఇ – ఇల్లాహి'ని ప్రారంభించాడు. భగవద్గీత, ఉపనిషత్తులు, ప్రబోధ చంద్రోదయ, యోగవాసిష్ఠ, మరెన్నో గ్రంథాలను, శ్రుతులను పర్షియను భాషలోకి అనువదించి దారా ముస్లిం మేధావుల్లో హిందూ ధర్మ భావ సమృద్ధిని ప్రవేశపెట్టాడు. దారాలోని జాతీయ సంస్కృతిని ప్రతి ఫలింపచేసే తార్కాణం ఒక్కటి చెప్పుకోవచ్చు.

*కాబాలో సోమనాథ మందిరంలో వుండేది నీవే*
*మఠంలో సత్రంలో కూడా వున్నది నీవే*
*దీపానివి నీవే కీటకానివీ నీవే*
*సారాగాని, సానిగాని*
*ఋషిగాని అవివేకిగాని*
*మిత్రుడుగాని శత్రువుగాని*
*అన్నీ నీవే అంతటా నీవే!*

దారాలోని ఈ స్ఫూర్తిని అద్వైతవాదులు గుర్తించగలరు. ఔరంగ జేబును చీకాకు పరచిన విషయం ముస్లిం మేధావులు జాతీయతా భావాలకు స్పందించటమే. విదేశీయుడైన కార్ల్ మార్క్స్ కూడా ఈ విషయాల్ని స్పష్టంగా గుర్తించాడు. **22**, జులై, **1853** న లండన్ నుంచి ఇలా వ్రాశాడు:

''భారత్‌ను ఆక్రమించిన అరబ్బులు, తురుష్కులు, టార్టార్లు, మొగలులు అందరూ హిందూత్వాన్ని పొందారు. ఈ అక్రమ బర్బర ఆక్రమణదార్లు అనంత చారిత్రక సిద్ధాంతాన్ని నిరూపిస్తూ తమ పాలిత ప్రజల అత్యున్నత నాగరికతకు తలవంచారు''..

**– దత్తోపంత్ ఠేంగ్డే.**

---

★ జాతీయ స్వాభిమానం అనేది ఏ స్వతంత్ర దేశానికైనా తక్కువ ప్రాముఖ్యం కలిగిన విషయం కాదు. స్వాభిమానంలో మమకారం దాగి ఉంటుంది. ఇది నాది అన్న దాంట్లోనే పని చేసేందుకు ప్రేరణ ఇమిడి ఉంటుంది. దానిని అహం (నేను) అని అంటారు. ఒక జాతి లోని వ్యక్తులను ఈ ''అహం'' తత్త్వమే క్రొత్త విషయాలను కనుగొనడానికి క్రొత్తదారినవి నిర్మించడానికి ప్రేరణ ఇస్తుంది. సంకట పరిస్థితులు ఏర్పడినపుడు దీని ఆధారంగానే ఒక స్వతంత్ర జాతి సాహసోపేతమైన చారిత్రాత్మకమైన నిర్ణయాలు తీసుకోగలుగుతుంది. దీనిని ఇట్టి విదేశీయ వాదులను, సిద్ధాంతాలను స్వీకరిస్తూ పోవడం జాతీయ స్వాభిమానానికి అనుకూలమైన విషయం కాదని అంగీకరించక తప్పదు.

**– దీనదయాళ్ ఉపాధ్యాయ.**

## మాటలుమాని పనిపెంచండి

- శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.



మనిషిగా పుట్టిన ప్రతి వ్యక్తీ మంచి పనులే చేయాలి. తక్కువగా మాట్లాడాలి. ఎక్కువగా పనిచేయాలి. సత్యమే చెప్పాలి. పదిమంది మేలు కోరాలి. జీవితం సామాన్యంగా గడిపినా ఆశయాలు మాత్రం గొప్పవిగా ఉండాలి. ఆశయాలుంటే చాలదు. వాటిని ఆచరణలో పెట్టాలి. అప్పుడే మనిషి 'మనీషి' అవుతాడు. అతని బ్రతుకుకు సార్ధకత చేకూరుతుంది.

## "విశ్వహిందు" సంపాదకులకు సమస్కారములు

విశ్వహిందుని పక్షపత్రిక చేస్తే బాగుంటుంది. విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో ఒక దినపత్రిక వుంటే ఇంకా బాగుండేది. ఇప్పుడు దాదాపు దినపత్రికలన్నీ హిందుత్వాన్ని ద్వేషించటం, విమర్శించటం, అనాగరిక పద్ధతిగా చిత్రించటం, అలవాటుగా మారింది. వీటిని చదివే వారిలో ఈ దేశమంటే ప్రేమ కనబరచటంలేదు. ఈ ధర్మమన్నా ప్రేమ కనబరచటంలేదు.

అసలు హిందుత్వానికి సంబంధించిన అనేక వార్తలు ఇప్పుడున్న దినపత్రికలు ప్రచురించటం కూడా తగ్గించి వేశాయి. కావున మీడియాను ప్రధాన అంశంగా భావించాలని తగుశ్రద్ధ వహించాలని కోరుచున్నాను.

**జి.కె.వి. నాధం**
విజయవాడ - 12.

---

★ హిందుత్వము నశించిపోతే ప్రపంచానికి ఎంతో లోటు కలుగుతుంది ప్రపంచం ప్రసక్తి లేకపోతే హిందువులు నశించినా, హిందుత్వం నష్టమైనా నేనేమాత్రం ప్రాముఖ్యం ఇవ్వను. ధర్మానికీ, తత్వజ్ఞానానికీ వ్యావహారిక రూపాన్ని ఇచ్చిన జాతి యావత్ ప్రపంచంలోను మన హిందూ జాతి ఒక్కటే. ఆత్మ నిత్యమని విశ్వసించడం మాత్రమేగాక భిన్నత్వంలో ఏకత్వాన్ని సాక్షాత్కరింప చేస్తున్నది కూడా మన జాతి ఒక్కటే. ఈ సిద్ధాంతాలను ఇవ్వాళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి - ప్రపంచం యావత్తూ స్వీకరిస్తుంది. వీని ఆవశ్యకతను గుర్తిస్తుంది. ఏదో ఒక రోజున ప్రపంచం ఆధ్యాత్మికతవైపు మొగ్గక తప్పదు. ఆనాడు మార్గ దర్శనం చేయ గలిగేది మన హిందూ జాతి మాత్రమే అట్టి ఈ హిందూ జాతి నశించిపోతే ఏమవుతుంది? మానవ జాతి మళ్ళీ ఓ, న, మాల నుండి మొదలు పెట్టవలసి వస్తుంది. **మదన మోహన మాలవ్య.**

---

### స్వామి వివేకానంద ఉవాచ

మనం నేర్చుకోవడానికే జన్మించాం. జీవితంలో మహదానందం అంటే నేర్చుకోవడమే. ఈ మానవత్మ మొక్క అస్తిత్వ ప్రయోజనం అధ్యయనాన్ని - ఆత్మానుభవాన్ని ప్రేమించడమే - ఇదే హిందూ జీవనదర్శనం.

# అభ్యాసవర్గలు పశ్చిమ ఆంధ్ర ప్రదేశ్‌లో

అనంతపురం : అనంతపురం జిల్లా అభ్యాసవర్గ జూలై 27, 28 తేదీలలో నల్లచెఱువులో జరిగింది 30 గ్రామాలనుండి 132 మంది పాల్గొన్నారు. మాతృమూర్తులు 30 మంది ఉన్నారు.

గుంతకల్ జిల్లా : గుంతకల్ జిల్లా అభ్యాసవర్గ జూలై 28, 29 తేదీలలో ఆదోనిలో గల రెడ్డి సంఘములో జరిగింది. 13 గ్రామాల నుండి 46 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

పాలమూరు : పాలమూరు జిల్లా అభ్యాసవర్గ జూలై 28, 29,తేదీలలో కల్వకుర్తిలో జరిగింది. 30 మంది పాల్గొన్నారు.

నల్లగొండ : నల్లగొండ జిల్లా అభ్యాసవర్గ ఆగష్టు 3, 4 తేదీలలో నల్లగొండలో జరిగింది. 20 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

కర్నూలు : కర్నూలు జిల్లాలో రెండు భాగ్‌లకు సంబంధించిన వర్గ ఆగష్టు 3, 4 తేదీలలో నందికొట్కూరు మండలములో గల కొణిదల గ్రామములో గల మల్లిఖార్జున దేవాలయములో జరిగింది. 17 గ్రామాల నుండి 70 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

మెదక్ : మెదక్ జిల్లా అభ్యాసవర్గ జూలై 27, 28 తేదీలలో సదాశివపేటలో జరిగింది. 35 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

నవాపేట : పాలమూరు జిల్లా నవీపేట మండలములో ఒకరోజు వర్గ 29 జూలై నాడు జరిగింది. 16 గ్రామాల నుండి 130 మంది పాల్గొన్నారు.

చేవెళ్ళ : రంగారెడ్డి జిల్లా చేవెళ్ళలో 4 మండలాల కార్యకర్తల వర్గ జూలై 21న జరిగింది. 11 గ్రామాల నుండి 40 మంది పాల్గొన్నారు.

పాలమూరు : పాలమూరు పట్టణములో ఆగష్టు 4వతేదీన విశ్వహిందూ పరిషత్ అధ్వర్యములో ఉపాధ్యాయుల సమ్మేళనము జరిగింది. 100 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. అందులో 40మంది మహిళలు ఉన్నారు. ప్రాంత ప్రధానకార్యదర్శి, శ్రీ మంచన గుండేరావు మరియు కార్యదర్శి శ్రీలక్ష్మీనాథాచార్యులు గారలు మార్గదర్శనం చేశారు.

జగిత్యాల : జగిత్యాల జిల్లా కార్యకర్తల ఒకరోజు వర్గ జూలై 14న జగిత్యాలలో జరిగింది. 160 మంది పాల్గొన్నారు.

వరంగల్ : వరంగల్ జిల్లా కార్యకర్తల ఒకరోజు వర్గ వరంగల్‌లో జరిగింది. 45 మంది పాల్గొన్నారు.

---

★ఆగష్టు 10,11తేదీలలో వరంగల్‌లో విశ్వహిందూ పరిషత్(ప. ఆం) ప్రాంత సమావేశాలు జరిగాయి. జిల్లా కార్యదర్శులు, విభాగ్ సంఘటనా కార్యదర్శులు, విభాగ్ ప్రముఖులు, ప్రాంత విషయప్రముఖులు, కార్యకారిణి అధికారులు పాల్గొన్నారు.

దక్షిణాంచల సహసంఘటనా కార్యదర్శి శ్రీ వై. రాఘవులుగారు నగర పెద్దల సమావేశంలో దేశకాల పరిస్థితులు వివరించి, సమాజ సమస్యల పరిష్కారానికి, దేశసమైక్యతకు, ధర్మరక్షణకై విశ్వహిందూ పరిషత్ అవసరాన్ని, నిర్వహిస్తున్న పాత్రను వివరించారు.

సమారోప కార్యక్రమంలో హితచింతకుల సంఖ్య ఇబ్బడి, ముబ్బడిగా పెంచవలసిన అవసరాన్ని కార్యకర్తలకు సూచించారు. (మా. వి)



బోనాలు ఉత్సవముగింపు – మహంకాళి మాత

Viswa Hindu Regd No. K 6235/Press SB/310/84-85 Postal Regd. No. G2. RNP/H-HD-650.



యుగపురుషుడు- శ్రీకృష్ణుడు



BOOK - POST

Published by T. Linga Murthy for Viswa Hindu Parishad, A.P. 4-5-212,